

రాష్ట్ర ముఖ్యమంత్రి
శ్రీ నారాచంద్రబాబునాయుడు గారితో ...



పద్మ విభూషణ్
శ్రీ కాళోజీ నారాయణ రావు గారితో...



హరి హరా కళాభవన్ లో రెబల్ స్టార్ కృష్ణంరాజు గారిచే సన్మానింపబడుచున్న...

# మిమిక్రీ ... మిమిక్రీ

## (A Text Book of Mimicry)

**CITATION NO.**
**2781/సా.తె. 700/89**





కళావాహిని టాప్‌టెన్ అవార్డీ

'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ'

# బొమ్మ శ్రీనివాస్

*B.Sc., B.Ed.,*

**Ph: ~~08712-~~2428299**

# MIMICRY... MIMICRY

Written by :
**BOMMA SRINIVAS**

| | |
|---|---|
| మొదటి ముద్రణ | - Sep. 2000 |
| రెండవ ముద్రణ | - Dec. 2000 |
| మూడవ ముద్రణ | - May 2001 |

**Rs. 50/-**
**Librarie Rate : 70/-**

ప్రతులకు సంప్రదించండి :

**బొమ్మ శ్రీనివాస్**
మిమిక్రీ ఆర్టిస్ట్ & వెంట్రిలాక్విస్ట్
ఇంటి నెం. 10-1-306, గోవిందరాజులగుట్ట,
వరంగల్ - 2. ఫోన్ : (08712) 428299

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాద్ (సుల్తాన్‌బజార్, ఆబిడ్స్)
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

***Title Designing :***
Kala Jyothi Process Limited, Muliti Colour Offset Printers,
1-1-60/5, RTC X Roads, HYDERABAD - 500 020.

***Composed & Printed at :***
**VIJAY OFFSET PRINTERS,**
Beside : Dr. Narasimha Rao Hospital Lane,
Near Radhika Talkies, Warangal - 506 002.
Phone : 24091.

***Title Photos :***
Jyothi Photo Studio, Chowrastha, Warangal.

# అంకితము



జన్మనిచ్చిన తల్లిదండ్రులు

**బొమ్మ కళావతి - వెంకటయ్య గారికి**

# కృతజ్ఞతాభివందనాలు



ఆదిగురువు

**శ్రీ డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారికి**



పూజ్య గురువు

**శ్రీ వై. పరమేశ్వరరావు గారికి**



పుస్తక సలహాదారులు

**శ్రీ దుస్సా చంద్రమౌళి గారికి**



సాహితీవేత్త

**షేక్ హాజి 'నూరాని' గారికి**

బొమ్మ శ్రీనివాస్

# ఇదే నామాట ...

మిమిక్రీ కళ అతిప్రాచీనమైనది. అనుకరణ (మిమిక్రీ) ఒక అద్భుత మానవ కృత్యం. దశాబ్దానికి పైగా కళాప్రదర్శనల్లో లీనమై, కళలో విలీనమైన నాకు తట్టిన చిరు ఆలోచనా పరిణామమే 'అనుకరణ' యొక్క సాహిత్యావిష్కరణ.

దశాదిశాలేని మిమిక్రీకి జవజీవాలు నింపి, నింగినంటే కళాసౌధాన్ని నిర్మించి, నా బోటి కళాకారులకు వారధిగా నిలిచిన ఆది గురువు పద్మశ్రీ డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారి అండ దండలతో, తన మిమిక్రీ ప్రదర్శన ద్వారా నన్ను కదిలించి, నాలో మిమిక్రీ కళాకారునికి జన్మనిచ్చిన మిమిక్రీ Ch. శ్రీనివాస్ గారి స్ఫూర్తితో, దుస్సా చంద్రమౌళి గారి సలహా, సహకారాలతో, కళకు సంబంధించిన సమస్త సమాచారాన్ని క్రోఢీకరించి సాహిత్యీకరించే యజ్ఞంలో వెన్నంటి నిలుస్తున్న హృదయనేస్తం షేక్ హాజి 'నూరాని' సాహచర్యంతో మిమిక్రీ కళను ప్రసాదించిన పూజ్య గురువు పై. పరమేశ్వర్ రావు గారి ఆశిస్సులతో నా సాహిత్య యాత్ర ప్రారంభమైంది.

వెలువరించిన కొన్నాళ్ళకే ''మిమిక్రీ... మిమిక్రీ'' పుస్తక ద్వితీయ ముద్రణ ఆ వెంటనే తృతీయ ముద్రణ కళాప్రియుల సాహిత్యాభిరుచికి దర్పణం. ఇదో పెద్ద సాహిత్యపరమైన ఉత్కృష్టగ్రంథం కాకపోవచ్చు. కాని 'ధ్వన్యనుకరణ' కళను కళాభిమాని గుండెకు చేర్చే ప్రయత్నానికి మాత్రం తార్కాణం. తృతీయ ముద్రణ ఘట్టానికి చేరిన ఈ సాహిత్య ప్రయాసలో హాస్య, వినోద, విజ్ఞానాల కోసం లిఖించిన మాటల మూటలు, హాస్య గుళికలు కల్పిత, వాస్తవాల సమ్మేళనం. కళాభిమానుల గుండెను తట్టిన అనుకరణ సిద్ధాంతాల విశ్లేషణా పరంపరలో ఉత్తరాలు ఉరిమినా, మిమిక్రీని సిద్ధాంతబద్ధమైన శాస్త్రమని ''ఇండియా టుడే'' అంతటి పత్రిక ప్రశంసించినా, ఇంతటితో తృప్తి వద్దని మిత్రులంతా హెచ్చరించినా, విమర్శలు వెల్లువెత్తినా, ప్రశంసలు పోటెత్తినా సాహిత్యకారుల, కళాకారుల సూచనలకు బద్ధుడనై, మిమిక్రీ సాహిత్య సంస్కరణలతో నా కలాన్ని కదిలిస్తాను. మున్ముందుకు సాగుతాను. ఇదే 'నా మాట...'

మీ

B. Srinivas

(బొమ్మ శ్రీనివాస్)



Kalaprapoorna
**Dr. NERELLA VENU MADHAV**
*Ex. M.L.C.*
**Mimicry Artiste**

# మేలి పలుకు

మిమిక్రీ కళాప్రవీణ చిరంజీవి బొమ్మ శ్రీనివాస్ రచించిన పుస్తకం 'మిమిక్రీ... మిమిక్రీ...' పుస్తకం ఆసాంతం పరిశీలించాను. శ్రీనివాస్ నాకు చిరసన్నిహితుడు. వేలాది ప్రదర్శనలతో ప్రేక్షకుల్ని శ్రోతల్ని రంజింపజేసి, మిమిక్రీ కళకు వన్నెతెచ్చినవాడు. ఇప్పుడు ఈ పుస్తకరచనతో, పాఠకులకు కూడా చేరువై, తన కళకు మరింత జనాదరణ చేకూర్చే ప్రయత్నం చేశాడు. ఇది చాలా ప్రశంసనీయమైన కృషి.

లోగడ మిమిక్రీ పాఠ్యప్రణాళిక నిర్మాణం ద్వారా నేను ప్రారంభించిన ప్రక్రియను, ఈ పుస్తకరచనతో శ్రీనివాస్ మరో మెట్టు ముందుకు సాగించాడు. మిమిక్రీ అంటే ఏమిటో, దాని విశిష్టత ఎంతటిదో, ఇటు సాధారణ పాఠకులకు, అటు అభ్యాసకులకు తెలియవచ్చేటట్లు, శాస్త్రీయంగా ప్రదర్శించే చక్కని ప్రయత్నం చేశాడు. దీనికి శ్రీనివాస్ ఎంతైనా అభినందనీయుడు. ఈ చిరంజీవి కళారంగంలో మరింత ఉన్నతి సాధించాలనీ అతని కళాజీవితం మరింత ఉజ్జ్వలంగా వెలుగొందాలనీ మనసారా ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు
నేరెళ్ల వేణుమాధవ్

**Shobha Nilayam**
# 11-25-45,
Vasavi Colony,
WARANGAL - 506 002 (A.P.)
Phone : 08712-**61388**

బొమ్మ శ్రీనివాస్
**Prof. (Mrs.) VIDYAVATI**
*Ph.D.*
Vice-Chancellor



KAKATIYA UNIVERSITY
Vidyaranyapuri
WARANGAL - 506 009
A.P - INDIA

No. 210/VCP/KU/2000

June 1, 2000

# MESSAGE

I have gone through the book "MIMICRY... MIMICRY" written by 'Dhwanyanukarana Prapoorna' **BOMMA SRINIVAS**. He himself is a Mimicry artiste. So far he gave more than 1,500 demonstrations. He received number of Awards and felicitations from aminent personalities like Sri Nara Chandrababu Naidu, Sri Kaloji Narayana Rao, Dr. Nerella Venumadhav (who is known as 'Father of Mimicry'). Dr. C. Narayana Reddy, Sri Akkineni Nageswar Rao and U. Krishnam Raju.

He is very much worried about bad habits like gutka and pan cheuing, and consumption of liqour. He is trying his level best to eradicate these bad habits from the minds of people through this art of 'Mimicry'.

His Book 'MIMICRY... MIMICRY' consists of four parts are very nicely arranged. In the frist part, he defined Mimicry and in the subsequent parts he explained about syllabus, Ventriloquism and other matters relating to subject. This Book will be certainly helpful to those who are interested to learn or know the art of Mimicry. At very young age, he reached to higher stage in the field of Mimicry.

I wish him all the best.

Vidyavati

**( VIDYAVATI )**

**Vidwan T.V. SUBBA RAO**
**Writer, Educationist &**
**Socio-Cultural Activist**

# ఆప్త వాక్యం

మిమిక్రీ కళకు సాటిలేని కాణాచి వరంగల్లు. ఈగనిలో వెలసిన మరో మాణిక్యం బొమ్మ శ్రీనివాస్. ధ్వన్యనుకరణ సామ్రాట్ డా॥ నేరెళ్ల వేణుమాధవ్ ఈతని ఆది గురువు. ఏ ప్రజ్ఞావంతుడైనా తాను సంపాదించిన జ్ఞానంలో...

'ఆచార్యాత్ పాదమాదత్తే, పాదం శిష్య స్స్వమేథయా
పాదం సబ్రహ్మచారిభ్యః, శేషం కాల క్రమేణ చ॥'

ఆచార్యుడిచ్చేది పావుభాగమే, శిష్యుడు తన సొంత ప్రజ్ఞవల్ల సాధించేది మరో పావు భాగం, తోటి వారి సాంగత్యంతో అలవాడేది మరో పావు, తక్కిన పావుభాగం జీవితానుభవం నుండి కాల క్రమంలో సంక్రమిస్తుంది. తన కళ సాధనలో శ్రీనివాస్ ఈ నాలుగు మార్గాల్లో దేన్నీ అసంపూర్తిగా విడువలేదు.

లలిత కళ ఏదైనా, బాగా జనాదరణ పొంది, పరిణత స్థితికి వచ్చినాకే దానికొక శాస్త్రం అంటూ పుడుతుంది. మిమిక్రీ ఈనాడు ఒక స్వతంత్రమైన ప్రదర్శన కళగా అవతరించి అగ్రశ్రేణిలో ఉంది. అందుకే దాని లోటుపాటులు, మెలకువలు, శాస్త్రీయ ఆధారాలు తెలిపే గ్రంథాలు నేడు అవసరం. 'నాకు తెలిసినంతవరకు తెలుగులో అచ్చంగా మిమిక్రీ కళపై వెలువడిన తొలి రచన ఇదే.'

మిమిక్రీ కళకు మానవ శరీర ధర్మం, భౌతికశాస్త్ర సూత్రాలు, మనోవిజ్ఞానం, లోకజ్ఞానం, ఇతరకళల పరిచయం, అగాధమైన పరిశీలన ఇలాంటి శాస్త్రీయ ఆధారాలున్నాయని ఈ పుస్తకం చాటి చెప్తున్నది. నూతన ప్రయోగాలు పరిశోధనలు ఈ కళను విశాలతరం చేయ్యడానికి ఎలా దోహదం చేస్తాయో వివరిస్తుంది.

విషయం ఎంత విశాలమైందో పాఠకుడి హృదయానికి హత్తుకునేలా ప్రదర్శించిన శ్రీనివాస్ ప్రవృత్తిచే కళాకారుడైనా వృత్తి చేతా ఉపాధ్యాయుడు అందుకే ఇంత చక్కగా ఆసక్తి రేకెత్తించేట్లు రచన చేయగలిగాడు. ఈ పుస్తకం ఒకవైపు సామాన్య పాఠకులకు అభిరుచి కలిగిస్తూ, మరోవైపు అభ్యాసకులకు పాఠ్య పుస్తకంలా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు.

శ్రీనివాస్ కలం నుంచి భవిష్యత్తులో మరిన్ని మిమిక్రీ సిద్ధాంత గ్రంథాలు వెలువడాలని ఆకాంక్షిస్తూన్నాను.

ఇట్లు
తెవివేటూరు సుబ్బారావు

**T.V. SUBBA RAO**
# 5-10-53, Kishanpura,
Hanamkonda, WARANGAL - 2.

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
# POTTI SREERAMULU TELUGU UNIVERSITY

**Prof. N. GOPI**
*M.A., Ph.D.,*
Vice-Chancellor



Lalitha Kala Kshetram,
Public Gardens,
Hyderabad - 500 004. (A.P.)

తేది : **26-06-2000**

## అభినందన

మిమిక్రి కళ పైన కరదీపికలాంటి పుస్తకమిది. రచయిత బొమ్మ శ్రీనివాస్ స్వయంగా ధ్వన్యనుకరణ కళాకారుడు. ధ్వన్యనుకరణ ప్రపూర్ణ బిరుదాంకితుడు. ఇతనికి వై. పరమేశ్వరరావు గారి శిష్యరికం, ధ్వన్యనుకరణ సామ్రాట్ డా॥ నేరెళ్ళ వేణుమాధవ్‌గారి ఆశీస్సులు లభించాయి. సామాన్యకుటుంబంలో జన్మించి ఈ కళానిశ్రేణికను అధిరోహిస్తూ ఇప్పటికే రాష్ట్రంలో, రాష్ట్రం బయటా వందలాది ప్రదర్శనలిచ్చిన ప్రజ్ఞాశాలి శ్రీనివాస్.

ధ్వన్యనుకరణ అంటే పశుపక్ష్యాదుల, జంతువుల, యంత్రశబ్దాల పునఃసృష్టి మాత్రమే కాకుండా జీవితంలోని వెలుగునీడల కళాత్మక ప్రదర్శన కూడా. ఏ కళ అయినా చైతన్యావారధీ, ఆనంద పరమావధి. బొమ్మ శ్రీనివాస్ మిమిక్రీ కళను ప్రజలను జాగృతం చేసే సాధనంగా భావించడం సంతోషం.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో గత రెండేళ్లుగా మిమిక్రీ కోర్సులు డా॥ నేరెళ్ళ వేణుమాధవ్‌గారి సారథ్యంలో నిర్వహిస్తున్నాము. ఆ కళను శాశ్వతం చేయాలన్న తపనతో గొంతు ద్వారా సంపాదించిన డబ్బును చేతి ద్వారా ఖర్చు పెడుతున్న కళతపస్వి వేణుమాధవ్‌గారు. మిమిక్రీ కోర్సు ఆవిర్భావానికి ఆయన రెండున్నర లక్షల విరాళం కూడా ఇచ్చారు. ఈ కోర్సు మరింత బలోపేతం కావడానికి విశ్వవిద్యాలయం ఆయనను హృదయపూర్వకంగా సమర్థిస్తున్నది. యేటా ఎందరో మంచి మిమిక్రీ కళాకారులను అందిస్తున్నందుకు విశ్వవిద్యాలయం సంతోషిస్తున్నది.

నలుగురు చదువుకోవడానికి బరువుగా కాకుండా సరదగా ఉన్న మంచి పుస్తకాన్ని రచించినందుకు బొమ్మ శ్రీనివాస్‌ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

(ఎన్. గోపి)

# విషయ సూచిక

## మొదటి భాగం



## రెండవ భాగము

## మూడవ భాగం



## నాలుగవ భాగం

# పుస్తక ముద్రణ దాతలు



*Vice District Governor - 2001 -2002*

**లయన్ *Er.* పోకల చందర్** *mjf*

*B.Tech.,*

ఇంటి నెం. 2-4-93, రాంనగర్,

హన్మకొండ - 506 001

ఫోన్ : 579405 (O), 578277 (R)

---



సేవా చక్ర అవార్డి

భీమారం లయన్స్ క్లబ్ ప్రెసిడెంట్

**లయన్ డా॥ వి. రాజన్‌బాబు**

*D.H.M.S., M.D. (AM)*

దివ్య ప్రజా వైద్యశాల

బీమారం బస్‌స్టాప్, మం॥ హసన్‌పర్తి, వరంగల్ - 15.

ఫోన్ : 438125 (C), 439770 (R)

---



**లయన్ శ్రీమతి, శ్రీ**

**మోతుకూరి**

**ఇందిర మనోహర్‌రావు**

ఇంటి నెం. 1-2-53,

శ్రీ నగర్ కాలని, భీమారం,

వరంగల్ - 506 015.

ఫోన్: 538575 (R), 572091 (O)

**INDUSHEKHARA GAS SERVICES**

(INDANE DISTRIBUTERS)




మిమిక్రీ... అంటే 'అనుకరణ'. దీనినే అచ్చు తెలుగులో 'స్వరవంచన' (స్వరాభినయం) అనీ లేదా 'ధ్వన్యనుకరణ' అని కూడా అంటారు. అనుకరించి నవ్వించడం అని మిమిక్రీ యొక్క పరమార్థం. నవ్వించడమే కాదు, నవరసాల్ని పండించి మెప్పించగలిగిన కళ మిమిక్రీ. స్వరవంచనలో 'స్వరం' అనగా గొంతు, 'వంచన' అనగా భ్రమింప జేయడం. అంటే గొంతు మార్చి పలకడం అని దీని తాత్పర్యం. విశ్వవిఖ్యాత ధ్వన్యనుకరణ తపస్వి డాక్టర్ నేరెళ్ల వేణుమాధవ్ గారిని మిమిక్రీ పితామహులు **(Father of the Mimicry)** అంటారు.

64 కళల్లో మిమిక్రీ ఒక కళ. అంతే కాదు 64 కళలను ఒకే ఒక కళలో చూపించగల మాహత్తర శక్తి ఉన్నటువంటి గొప్ప కళ మిమిక్రీ.

> ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని ఇంకొకరిలో
> కలిగించడానికి చేసే ప్రయత్నమే 'కళ'.
>
> – టాల్‌స్టాయ్




అనాదిగా మానవుడు ఆనందంతో వేసిన చిందులే నేడు నాట్యకళకు నిదర్శనాలు. అలాగే ఈ మిమిక్రీ కళ ఈ నాటిది కాదు. అలనాడు శ్రీ రాముడు జీవించిన కాలం అనగా త్రేతాయుగం ఈ 'కళ' కు మూలం అంటారు. రావణాసురుడు, తమ్ముడు మారీచుడిని పిలిచి...

'ఓరి మారీచా! నీవు బంగారు జింకగ మారి సీతాదేవికి ఆకర్షణీయంగా కనబడుపో ...!'

అని ఆజ్ఞాపించగ అతడు బంగారు మాయలేడిగ మారి తిరుగుతుంటే, సీతాదేవి ఆ బంగారు మాయలేడి నాకు కావాలి అన్నప్పుడు శ్రీ రామచంద్రుడు వెంటాడుతూ అడవిలో ఒక స్థలం దగ్గర బాణం ఎక్కుపెట్టి కొట్టినప్పుడు ఆ మాయలేడి చనిపోతూ గొంతుమార్చి శ్రీరాముని గొంతుని అనుకరిస్తూ ...

> మానవ జీవితం కేవలం తిండికోసం కాదు.
> కళ ''కళ'' కోసం కాదు. ప్రజల కోసం.
>
> – ఆర్యోక్తి

'హా... లక్ష్మణా'

అని అరచింది. ఈ గొంతు విన్న లక్ష్మణుడు శ్రీరామునికి ఏదో ఆపద సంభవించినదని భావించి సీతాదేవిని ఒంటరిగా కుటీరంలో వదలి అడవిలోనికి పరుగెత్తాడు. అటునుండి చెట్టు చాటుగా చూస్తున్న రావణుడు వచ్చి సీతాదేవిని మాయమాటలతో ఎత్తుకుపోయాడు. ఆ తరువాత కథ మీ అందరికీ తెలుసు. కాని ఇక్కడ చెప్పదల్చుకున్న విషయమేమంటే జింకపిల్ల శ్రీ రాముని గొంతుని అనుకరించింది. అంటే మిమిక్రీ చేసింది. దీన్ని బట్టి అప్పుడే ఈ ఆర్ట్‌కు అంకురార్పణ జర్గిందని చెప్పవచ్చు.

రామాయణం 'బాలకాండ'లో అహల్యా వృత్తాంతంలో ఇంద్రుడు కోడిగొంతుని అనుకరించగ, గౌతమ మహర్షి తెల్లారిందనుకొని తపస్సుకు వెళతాడు. నిజానికి అప్పుడు రాత్రి పన్నెండు గంటలవుతుంది. అంటే ఇక్కడ ఇంద్రుడు కోడిగొంతుని అనుకరించి గౌతమ మహర్షిని భ్రమింపజేసాడు.

అలాగే మహాభారతంలో భీముడు ద్రౌపది గొంతుని అనుకరించి కీచకుణ్ని వధించడం కూడా మిమిక్రీయే.

పై ఉదాహరణల వలన మిమిక్రీ ఈనాటిది కాదు రామాయణ, మహాభారత కాలం అనగా త్రేతాయుగం, ద్వాపరయుగం నుండి ఉందని స్పష్టంగ తెలుస్తున్నది.

> 'కళ' అనేది ప్రజలకు చెందిన ఆస్తి. అది గనిలో నుండి తీసిన బంగారం. అది ప్రజల హృదయకుహరాల్లో నాటుకుపోయి, వారి అభ్యుదయానికి మార్గదర్శకం కావాలి.
>
> – లెనిన్




మిమిక్రీ ని ప్రధానంగా రెండు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి

1. **ధ్వన్యనుకరణ** ('ధ్వని'ని అనుకరించడం)
2. **చేష్టానుకరణ** (హావ, భావాలను మాత్రమే అనుకరించడం)

1. **ధ్వన్యనుకరణ :-** కేవలం అనుకరణ. అనగా గొంతుల్ని మార్చి ఎవరూ ఎలా మాట్లాడితే అలా మాట్లాడటం. శబ్దాలను **(Sounds)**, స్వరాల **(Voice's)** ను అనుకరించడం మాత్రమే చేయాలి. ఇక్కడ 'అభినయం' ఉండకూడదు.

**ఉదాహరణ :-** యన్.టి.ఆర్., చిరంజీవి, రావు గోపాలరావు, పి.వి. నర్సింహారావు, నారా చంద్రబాబునాయుడు, రేలంగి, రాజబాబు మొదలగు వారు ఎలా మాట్లాడితే అలా గొంతు మార్చి మాట్లాడాలి. కాని వారి మ్యానరిజమ్స్ (అలవాట్లను) అనుకరించకూడదు. ఇలా చేసినట్లయితే దానిని ధ్వన్యనుకరణ అంటారు. అలాగే రైలు, విమానం, ఆటోరిక్షా, పోలీసు జీపు సైరన్ మొదలగు శబ్దాలు కూడా ఇందులో చెప్పొచ్చు.

> సౌందర్యము, సత్యము వీని రసవత్సమ్మేళనమే 'కళ'
>
> \- రవీంద్రనాథ్ టాగూర్

**2. చేష్టానుకరణ** :-దీనిని తెలుగులో 'మూకాభినయం' అంటారు. ఇంగ్లీషులో 'మైమ్' అంటారు. అంటే మాటలు లేకుండా అభినయించడం. ఇక్కడ ధ్వని ఉండవలసిన పనిలేదు. ఇందులో వారివారి అలవాట్లు (మ్యానరిజమ్స్) ను చూపించవలెను.

**ఉదాహరణ** :-

| | | |
|---|---|---|
| పి.వి. నర్సింహారావు | : | మూతి కొద్దిగా సాచి ఉంచడం |
| యన్.టి.ఆర్. | : | గంభీరంగా చెయ్యి ఎత్తడం |
| ఎ.యన్.ఆర్. | : | కాలర్ పట్టుకొని వేలుతో చూపించడం |
| చంద్రబాబు నాయుడు | : | కుడిచేతి వేలెత్తి హెచ్చరించినట్లు చెప్పడం |
| బాలకృష్ణ | : | తల ఎగరేయడం |

పై విధంగా ఒక్కొక వ్యక్తికి ఒక్కొక్క ప్రత్యేకమైన అలవాటు ఉంటుంది. మూకాభినయం (మైమ్) ద్వారా ఆ వ్యక్తి యొక్క నైజం, ప్రకృతి, దేహ స్వభావం, వ్యక్తి స్వభావం మరియు వారి మానసిక స్వభావమును కూడా అనుకరించాలి.

ఇలా ధ్వన్యనుకరణను, చేష్టానుకరణను రెండింటిని ఏకకాలంలో అభినయించి, అనుకరించి చూపించినప్పుడు ప్రేక్షకులు పరమానంద భరితులవుతారు. దీన్ని బట్టి ధ్వన్యనుకరణ, చేష్టానుకరణ మిమిక్రీ యొక్క రెండు ప్రధానాంగాలని అవగతమవుతున్నది.

> ప్రజల జీవన సమస్యలతో సంబంధంలేని 'కళ' నిరుపయోగం.
>
> – పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ




మిమిక్రీ అనగానే **Comedy**(నవ్వించడం) చేస్తారు చూడు, అంటుంటారు. మరి ఈ ఆర్ట్ ముఖ్య ఉద్దేశ్యం అదే కదా! మిమిక్రీ చేసేవారు ఎక్కువగా రేడియో, టి.వి. కళాకారులు, కవులు, రచయితలు, గాయనీ గాయకులు, రాజకీయనాయకులు మరియు సినీనటులను అనుకరిస్తారని అంటుంటారు. నిజమే ... వీరినే ప్రధానంగా ఎందుకు తీసుకుంటారో చూద్దాం.

మా వాడలో ఒక అబ్బాయి చాలా లావుగా ఉన్నప్పటికినీ 'ఏమండీ మీరు బాగున్నారా?' అని అమ్మాయిలా సన్నగా మాట్లాడతాడని అనుకరించి చూపించడం వల్ల మీకు ఎక్కువగా నవ్వు రాకపోవచ్చు. ఎందుచేతనంటే ఆ లావు పాటి వ్యక్తి ఎవరో మీకు తెలియదు కనుక.

> 'కళ' అంటే జీవితం యొక్క పాఠ్య గ్రంథం.
>
> – చెర్ని షెవ్స్కీ

అందు వలన సామాన్య ప్రజలకు సైతం పరిచయమున్న కళాకారులను, రాజకీయ నాయకులను మరియు ముఖ్యంగా సినీ నటులను తీసుకొని అనుకరించడం వల్ల, ప్రేక్షకులకు వారి గురించి అవగాహన ఉండటం వల్ల పరమానంద భరితులవుతారు. కావున మిమిక్రీ ఆర్టిస్ట్ ఎల్లప్పుడూ ఇదే విధానాన్ని అనుసరిస్తూ ఉంటాడు. ఇలా చేస్తేనే అతడు సఫలీకృతుడౌతాడు.



రెబల్‌స్టార్ కృష్ణంరాజు పుట్టినరోజు వేడుకల సందర్భంగా...

నాటక ప్రదర్శనలో సంగీతం కంటే, ఉచ్ఛారణ కంటే పాత్రోచితమైన భావాన్ని ఎవరైతే ప్రధానంగా పోషించగలరో వారంతా నటులు. తక్కిన వారంతా వేషధారులుగా మాత్రమే వుండిపోతారు.

- బళ్ళారి రాఘవ




మిమిక్రీ ''కళ'' పుట్టుక **(by birth)**తో ఉండాల్సిందే. అంతే కాని ఇదేదో కంప్యూటర్ కోచింగ్ లాగానో ఇంకా ఏదో నేర్చుకొన్నట్లు గానో నేర్చుకొంటే వచ్చేది కాదు. ఆర్ట్ అనేది ఏదైనా సహజంగా ఉండాల్సిందే. అప్పుడే సృజనాత్మకంగా హృదయాంతరాలలో పుట్టిన భావాలను రంగరించి గుబాళింపజేస్తాడు మిమిక్రీ కళాకారుడు.

చిన్నప్పుడు మీ మాస్టారు ఇలా మాట్లాడేవారు, అలా నడిచేవారు అని మీ మిత్రునితో మీరు మామూలు మాటల్లో చెబితే అర్థం కాకపోవచ్చు. అదే మీరు అయనలా అనుకరించి మాట్లాడి **(Pronounciation)** అభినయించి **(Acting)** చూపిస్తేనే అతడికి సరిగ్గా అర్థం అవుతుంది. ఇలా బాల్యం నుండి ఎవరైతే పరిశీలనా శక్తితో అన్ని

> అన్నార్తులైన ప్రజాకోటికి ఉపకరించేది ప్రతీది నా కంటికి అందంగా కనబడుతుంది. అదే నిజమైన 'కళ'.
>
> – గాంధీ

విషయాలను అనుకరించే ప్రయత్నం చేస్తుంటారో అటువంటి మనస్తత్వం కలవారికి మాత్రమే మిమిక్రీ వస్తుంది. ఇలాంటి వారే మిమిక్రీలో చక్కగా రాణిస్తారు. అంతే కాని 'కళ' అనేది ఎవరికి పడితే వారికి వచ్చేది కాదు. డబ్బుతో కొనుక్కునేది అసలే కాదు. ముఖ్యంగా గాత్రానికి సంబంధించినంత వరకు 'కళ' భగవంతుని గిఫ్ట్.

మనం చేసే 'ఆర్ట్'
భగవంతుని 'గిఫ్ట్'
చేయాలి దాన్ని 'సాఫ్ట్'
ఇస్తుంది మనకు 'లిఫ్ట్'

మిమిక్రీ ... విన్నవారందరికీ, చూసిన వారందరికీ మరియు పుస్తకాలు చదివినంత మాత్రాన రాదు. మరి ఎలాంటి వారికి వస్తుందో ఒక చక్కని ఉదాహరణ చదవండి.

**ఉదాహరణ :-** ఒక చిన్నపాప బాగా ఏడుస్తూ ఉంటుంది. వాళ్ల అమ్మ పెద్దమ్మాయికి గాని లేదా అబ్బాయికి గాని ఇచ్చి ఎత్తుకొని ఏడుపు మాన్పించమని చెబుతుంది. ఆ అబ్బాయి కాని, అమ్మాయి కాని ఏడుపు మాన్పించటానికి నానా తంటాలు పడతారు. అందులో భాగంగా ఆ చిన్న పాపాయిని ఎత్తుకొని...

అదిగో చూడు కుక్క, కుక్క
'బౌ... బౌ... బౌ...'

> సాహిత్య, సంగీత కళావిహీనుడగు వాడు కొమ్ములు,
> తోకలేని పశువు వంటి వాడు.
>
> – సంస్కృత సూక్తి

మిమిక్రీ... మిమిక్రీ...

అని అరచి చూపిస్తూ విన్పిస్తారు. అంటే కుక్క గొంతుని అనుకరిస్తుంటారు.

అదిగో చూడు పిల్లి, పిల్లి

'మియ్యాం... మియ్యాం...'

అని అనుకరిస్తుంటారు. ఇంకా

'అదిగో రైలు చూడమ్మా... రైలు

'కో... చుక్... చుక్...'

అని రకరకాల శబ్దాలను అనుకరించి విన్పిస్తుంటారు.

నిజానికి ఇక్కడ మీరు బాగా పరిశీలించండి. ఆ అమ్మాయిగాని, అబ్బాయి గాని ఎక్కడయినా మిమిక్రీ నేర్చుకొని వచ్చారా...? నేర్చుకొని వచ్చి ఆ ఏడుస్తున్న పాపాయికి చెప్పారా...? లేదు.

మరి ఎలా చెప్పగలిగారు? అంటే వాళ్లంతట వాళ్లే పరిశీలనా శక్తితో సృజనాత్మకంగా ప్రదర్శించి చూపించినారు. ఇలా ఎవరైతే చేయ గలుగుతారో వారికి ఈ మిమిక్రీ తొందరగా వస్తుంది. అంతేగాని ఎవరికి పడితే వారికి రాదు. అలా వచ్చేది 'కళ' **(Art)** కాదు.

పిల్లలు ఎక్కువగా టీచర్స్ ఆధీనంలో ఉంటారు. కావున టీచర్స్‌ని అనుకరించడానికి పిల్లలకు అవకాశం ఎక్కువగా ఉంటుంది. నేను వనాసూంఅలి హైస్కూల్‌లో చదువుకొనే రోజుల్లో అక్కడి హెడ్‌మాస్టర్‌తో సహా టీచర్స్ అందరిని అనుకరించి, అభినయించే

> నాటక కళాభ్యుదయం ఆధారంగా ఒక జాతి సంస్కృతి యొక్క ఔన్నత్యం నిర్ణయించబడుతుంది.
>
> \- రవీంద్రనాథ్ ఠాగూర్

సందర్భంలో నాతోటి విద్యార్థులు సంతోషించేవారు. అలాగే వివేకానంద జూనియర్ కళాశాలలో ఇంటర్‌మీడియట్ చదివే రోజుల్లో ఫిజిక్స్ లెక్చరర్ శ్రీ సమ్మయ్య గారిని అనుకరించినపుడు తోటి విద్యార్థులు ఎంతో ఆనందం పొందేవారు. సి.కె.యం. కళాశాలలో జువాలజి లెక్చరర్ శ్రీ రమేశ్‌గారి మ్యానరిజమ్‌ను అనుకరించినప్పుడు స్టూడెంట్స్ ఆనందానికి అవధులుండేవి కావు. అందుకే పిల్లలు ఎక్కువగా టీచర్స్‌ను అనుకరించటానికి అవకాశం వుంటుందనటానికి ఇవి కొన్ని నిదర్శనాలు మాత్రమే.

మిమిక్రీ కళ పుట్టుకతో ఉండాలి. ఎందుకంటే ఒక టెక్నీషియన్‌ని తయారు చేయవచ్చు. ఒక మెజిషియన్‌ని తయారు చేయవచ్చు ఎందుకంటే వీరందరూ కృషి, పట్టుదల మరియు సాధన చేత పైకొస్తారు.

కానీ... ఒక గాయకుణ్ని తయారు చేయలేము. ఒక సంగీత విద్వాంసుణ్ని తయారు చేయలేము. అలాగే మిమిక్రీ కళాకారుణ్ని కూడ తయారు చేయలేము. గాత్రానికి (స్వరము) సంబంధించినంత వరకు ఆర్ట్ అనేది భగవంతుడు ఇచ్చిన గిఫ్ట్ ఆ స్వర మాధుర్యం, ప్రత్యేకతలను కలిగి ఉన్నప్పుడే కృషి సాధనలతో అంఖడ కీర్తి ప్రతిష్ఠలను సాధిస్తారు. ఈ విధంగా గాత్రానికి సంబంధించిన కళ అంతర్లీనంగా ఉన్నప్పుడే ఎవరైతే నిరంతరం కృషి, సాధన చేస్తారో వారు మాత్రమే చరిత్రలో నిలిచిపోతారు.

> ప్రకృతికి దర్పణమే నాట్య కళ.
>
> \- షేక్స్పియర్

ముఖ్యంగా ఈ మిమిక్రీ నేర్చుకోవడం అనేది క్రింది అంశాలపై ఆధారపడి ఉంటుంది. అవి.

A) పరిశీలనా శక్తి **(Observation)**

B) పరిపక్వత **(Maturity)**

C) సంసిద్ధత **(Readyness)**

D) సాధన **(Practice)**

E) ప్రేరణ **(Inspiration)**

F) శిక్షణ **(Training)**



హృదయ సౌందర్యం లేని శరీర సౌందర్యం వ్యర్థం.

\- వివేకానంద

# A



# పరిశీలనా శక్తి (OBSERVATION)

జ్ఞానాన్ని సంపాదించాలంటే పరిశీలన అవసరం అన్న విషయం మన అందరికి తెలుసు. జీవితంలో పరిశీలనకు కొంత వరకు హద్దులు పెట్టుకోవచ్చు. ఉదాహరణకు వ్యవసాయంలో ఉన్నవారికి చెట్ల గురించి, పంటల గురించి, వాతావరణం గురించి, ఎరువుల గురించి, మార్కెట్లో ఉన్న ధరల గురించి తెలిస్తే సరిపోతుంది. అలాగే వ్యాపారంలో ఉన్నవారికి వారు చేస్తున్న వ్యాపారానికి సంబంధించిన వివరాలు తెలిస్తే సరిపోతుంది. కాని నటనలో అలాకాదు. నటునికి తారసపడిన ప్రతి విషయం గురించి పరిశీలించి ఆ వివరాలను గుర్తుంచుకోవాలి.

ఈ అబ్జర్వేషన్ అనగా 'పరిశీలనా శక్తి' ఎంత ఎక్కువగా ఉంటే మిమిక్రీ అంత తొందరగా వస్తుంది. మిమిక్రీ ఆర్టిస్టుకు అబ్జర్వేషన్ అనేది చాలా చాలా అవసరం. చాలా తీక్షణంగా పరిశీలించి, క్షుణ్ణంగా

> 'కవి' తాను అనుభవించిన హృదయ వేదననే కవితగా మార్చి ప్రపంచానికి ఉపదేశ మొనర్చుతాడు.
>
> – షెల్లీ

అధ్యయనం చేసి, సూక్ష్మంగా ఆలోచించి చేసినప్పుడు దీని ఫలితాలను మరియు ప్రేక్షకుల మన్ననలను పొంది మరింత అభివృద్ధి చెందగలడు. మరి దీని గురించిన ఒక ఉదాహరణ చూడండి.

**ఉదాహరణ :-** కొంతమంది పడుకున్న తరువాత 'గురక' పెడుతుంటారు. సాధారణ వ్యక్తి చూసినపుడు 'గురక పెడుతున్నాడులె' అనుకొని ఊరుకుంటాడు. కానీ మిమిక్రీ ఆర్టిస్టుకు అబ్జర్వేషన్ గుణం ఎక్కువ అని మనము ముందే అనుకున్నాము కదా! దాని సహాయంతోనే అతను ఈ పరిస్థితిని అంచనా వేయగలడు. నాకున్న అనుభవంలో గురకలు మూడు రకాలుగా ఉంటాయని గ్రహించాను. అందులో...

మొదటి రకం :- కర్ ర్ ర్ ర్... కర్ ర్ ర్ ర్...

రెండవ రకం :- కర్ ర్ ర్ ర్... కఫ్ ఫ్ ఫ్...

మూడవ రకం :- కర్ ర్ ర్... కఫ్ ఫ్ ఫ్... తుస్ స్ స్...

ఇలా సూక్ష్మంగా గ్రహించే పరిశీలనా శక్తి **(Keen Observation)** మిమిక్రీ ఆర్టిస్టుకు ఉండాలి.

**Art is imitation of the Nature.**

– అరిస్టాటిల్

B



# పరిపక్వత (MATURITY)

ఆర్ట్ అనేది పుట్టుకతోనే ఉండాలి. అంటే పుట్టగానే కళను ప్రదర్శిస్తాడని కాదు. ఆ లక్షణాలు అంతర్లీనంగా ఉంటాయి. శారీరక వయస్సు ఆ కళకు సరిపడ ఉన్నప్పుడే నేర్చుకొనగల్గుతాడు. 5 నెలల అబ్బాయి ఎలాంటి కృత్యాలు, ట్రెయినింగ్ ఇచ్చిన నడవలేడు. 5 సం॥ల పిల్లాడికి బాక్సింగ్ నేర్పలేము. ఎందుకంటే అతని శారీరక వయస్సు సరిపోదు. అలాగే ముఖ్యంగా మిమిక్రీ కళ నేర్చుకోవాలంటే ఆ వ్యక్తికి కనీసం 6 సం॥ల వయస్సులో వీలవుతుంది. ఈ వయస్సును 'ఉత్తర బాల్యదశ' అంటారు. ఈ టైమ్‌లోనే పిల్లలు పాఠశాలలో ప్రవేశిస్తారు. ఈ వయస్సును 'పాఠశాల దశ' అని దీనినే 'ముఠా వయస్సు' అని కూడా అంటారు. పిల్లలు అనుకరణ ఎక్కువగా ఈ వయస్సులోనే ప్రారంభిస్తారు. అనుకరణ అంటే ఇక్కడ మిమిక్రీ అని కాదు నిత్య

> అక్షర రూపం దాల్చిన ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్ళకు కదలిక.
> ఆ కదలికకు సాధనం గ్రంథాలయం.
>
> – కాళోజి నారాయణరావు

జీవితంలో ప్రతి దానిని అనుకరిస్తుంటారు. పైగా ఈ ఉత్తర బాల్య దశ 6-10 వయస్సులోనే శాశ్వత దంతాలు వస్తాయి. పదాలను పలకడానికి పళ్లు సహకరిస్తాయన్న విషయం వేరే చెప్పనవసరం లేదు. అన్నింటి కన్నా ముఖ్యంగా జ్ఞానానికి సంబంధించిన అనేక విషయాలు ఈ వయస్సు నుండే నేర్చుకొంటారు. సాంఘీక ప్రవర్తన, అభిరుచులు పెంపొంది అతని వైఖరిలో చాలా మార్పులు వస్తాయి.

కావున మిమిక్రీ నేర్చుకోవటానికి పరిపక్వత తప్పకుండా ఉండాలి.



వెంట్రిలాక్విజమ్‌లో సరికొత్త భాణీలను ప్రదర్శిస్తు టాకింగ్ డాల్ ఎలా మట్లాడుతుందో అని చూపిస్తున్నా...

అదర్శం లేని వ్యక్తి తెడ్డు లేని పడవ వంటివాడు.

- గాంధీ

# C



# సంసిద్ధత (READYNESS)

వ్యక్తిలో మిమిక్రీ కళ సహజంగా ఉండి నేర్చుకొనుటకు సంసిద్ధంగా ఉన్నప్పుడే ఆ కళను నేర్చుకొనగలుగుతాడు. అనగా ఆ కళను నేర్చుకొనుటకు అన్ని విధాల తయారై ఉండడమన్నమాట. మ్యాథమేటిక్స్ విద్యార్థికి కంప్యూటర్, ఫిజిక్స్ నేర్చుకోవడం సులభంగా ఉంటుంది. అదే లాంగ్వేజి చదివిన విద్యార్థికి కష్టంగా ఉంటుంది. అయితే మ్యాథమేటిక్స్ విద్యార్థి కంప్యూటర్ గాని, ఫిజిక్స్ గాని నేర్చుకోవడానికి అయిష్టంగా ఉన్నప్పుడు వాటిని నేర్చుకొనలేడు. అంటే ముందు ఏదైనా నేర్చుకోవలెనంటే ఆ సబ్జక్ట్ పట్ల, ఆ కళ పట్ల శ్రద్ధ, ఆసక్తి, ఉత్సాహం కుతూహలంతో పాటు సంసిద్ధత ఉండాలి. దీనిని ఒక్కమాటలో చెప్పాలంటే 'గుఱ్ఱమును నీళ్ళవరకు తీస్కెళ్ల వచ్చును కానీ నీటిని తాగించలేము' అనే సామెతతో పోల్చి చెప్పవచ్చును.

కనుక మిమిక్రీ నేర్చుకోవాలనే తపన, కుతూహలం, ఉత్సాహం, ఆసక్తి ఉన్నప్పుడే మిమిక్రీ అభ్యసనం సులభం అవుతుంది. అప్పుడు మిమిక్రీ కళకు సంబంధించిన ఫలితాలు సంతృప్తికరంగా ఉంటాయి.

> క్రోధం, పగ ఇవి నీచ మానవ ప్రవృత్తికి చెందినవి. వీటిని విసర్జించుము.
>
> \- అరవిందుడు

D




మిమిక్రీ కళాకారుడు ఒక సన్నివేషాన్ని కాని, ఒక సౌండుని కాని, ఒక వాయిస్‌ని గాని ఉన్నది ఉన్నట్లు అనుకరించగల్గుతున్నాడంటే దాని వెనుక అతని 'సాధన' ఎంతో ఉంటుంది. అందుకే **Practice Makes Perfect** అన్నాడొక మహానుభావుడు. ఈ సామెత 'మిమిక్రీ కళకు' పూర్తిగా సరితూగుతుంది.

ఒక కొత్త సన్నివేశం చూసినప్పుడు గాని, విన్నప్పుడుగాని ఆ సన్నివేశం ఉన్నది ఉన్నట్లుగా అనుకరించాలంటే కొందరికి ఒకటి, రెండు సార్లు సాధన చేస్తే రావచ్చు. మరికొందరికి ఒక్కొక్కసారి 70-80 సార్లు ప్రాక్టీస్ చేస్తేగాని స్పష్టంగా విన్పించలేరు. ఎందుకంటే ఆ సన్నివేశానికి సంబంధించిన సౌండ్స్, గొంతులు అతని గొంతుకు సారూప్యత (దగ్గరి సంబంధం) కలిగి ఉన్నప్పుడు తొందరగా అనుకరించగలడు. భిన్నంగా ఉన్నప్పుడు ఎక్కువ సార్లు సాధన చేయాల్సి ఉంటుంది. మిమిక్రీ కళలో సాధన లేకుండా ఏ ఐటమ్‌ను స్టేజిపై విన్పించలేము. కనుక ఈ కళ పూర్తిగా సాధనపై ఆధారపడి ఉంటుంది అని స్పష్టంగా చెప్పవచ్చును.

> నిరక్షరాస్యత మనదేశానికి తలవంపులు తెస్తున్న కళంకం. దీనిని నిర్మూలించి తీరాలి.
>
> \- గాంధీ

# E



# ప్రేరణ (INSPIRATION)

మిమిక్రీ అభ్యసనానికి 'ప్రేరణ' రాచబాట వంటిది. ప్రేరణ అనేది ప్రధానంగా నాలుగు అంశాలపై ఆధారపడి వుంటుంది. అవి ప్రోత్సాహం, పొగడ్త, అభినందన, బహుమతి. ఇవన్నీ లభించినపుడు మిమిక్రీ అభ్యసనం చూరుకుగా జరుగుతుంది.

ఒక వ్యక్తి తన కృత్య నిర్వహణలో చూపించే శక్తి లేదా ఉత్సాహం పెంపొందించడానికి కానీ లేదా తగ్గించడానికి దోహదం చేసే కారకాలను 'ప్రేరణ' అని 'డీసెకో' చాలా చక్కగా అభివర్ణించాడు.

మిమిక్రీ నేర్చుకొనే విద్యార్థులకు విద్యాబోధన చేసే ముందు వారిలో ప్రేరణ కలిగించవలెను. మిమిక్రీ ఎందుకు నేర్చుకొంటున్నామో దాని వలన ఎలాంటి ప్రయోజనాలున్నాయో ముందు తెలుపవలెను. ఒక ఆర్టిస్ట్ ఒక ప్రోగ్రామ్ ఇచ్చాడనుకుందాం. ఆ ప్రోగ్రామ్ వలన అతనికి సమాజము నుండి అంటే ప్రేక్షకుల నుండి అనేక ఉద్దీపనలు వస్తాయి. వాటికి వ్యక్తి (కళాకారుడు)

న్యాయం గెలుస్తుందన్న మాట నిజమే. కాని గెలిచిందంతా న్యాయం కాదు.

– శ్రీశ్రీ

ప్రతిస్పందిస్తాడు. ఈ ఉద్దీపనా - ప్రతిస్పందనల మధ్య మిమిక్రీ అభ్యాసనం కొనసాగింపబడుతుంది. ఈ విధంగా కొనసాగింపబడిన అభ్యాసనము చివరికి అతని అవసరాలతో ముడిపడి ఉంటుంది. ఈ విధంగా ఒక మంచి ప్రేరణ వలన ఒక సమాజం మంచి కళాకారున్ని సంపాందించుకోవచ్చు లేదా చెడు ప్రేరణ **(Negative Inspiration)** కలిగించి ఒక మంచి కళాకారున్ని కోల్పోవచ్చు.



నీరు ఎంత అమూల్యమైనదో, బావి ఎండిపోయే వరకు తెలియదు.
- థామస్ ఫుల్లర్

F



# శిక్షణ (TRAINING)

మిమిక్రి అభ్యసనానికి పరిశీలనా శక్తి, పరిపక్వత, సాధన ఎంత అవసరమో, శిక్షణ కూడా అంతే అవసరం. మిమిక్రి నేర్చుకోవడానికి ఆ కళ పట్ల మంచి అవగాహన, పరిశీలనా శక్తి, పరిపక్వత, అభిరుచి, సాధనా సామర్థ్యాలతో పాటు తగిన శిక్షణ కూడా ఉంటేనే ఆ కళాకారుడు అభివృద్ధిలోకి వస్తాడు. శిక్షణ లేని కళాకారుడు సరిగ్గా రాణించలేకపోవచ్చు.

క్రొత్తగా వచ్చిన కళాకారుడు సినీ ప్రముఖుల డైలాగ్స్‌లోని ఉచ్ఛారణల్ని అనుకరించాలంటే కష్టమవుతుంది. స్వయం కృషితో పాటు మంచి శిక్షణ పొందితేనే ఈ లోటు పాట్లను సవరించుకోగల్గుతాడు. అంతే కాదు మిమిక్రీ కళాకారుడికి సాహిత్యం మీద ఎంత ఎక్కువ అవగాహన వుంటే మిమిక్రీ అంత గొప్పగా పండుతుంది. మిమిక్రీ సిలబస్‌లోని 7 భాగాలను అదే క్రమములో సవిస్తారముగా బోధించగలిగే సామర్థ్యమున్న వారే మిమిక్రీ శిక్షణనిచ్చుటకు అర్హులు.

> 'కళ' అన్నది ఒక విశ్వజనీనమైన భాష.
>
> – టాల్‌స్టాయ్




ఒక్క మాటలో చెప్పాలంటే కళాకారుల జీవితాలు బురదలో నుండి పద్మం (తామర పువ్వు) వికసించినట్లే వుంటాయి. జీవితం ఏమిస్తుందో అది తీసుకొని తృప్తిపడతారు. కళాకారులు తమకు ఏమి కావాలో దాని కోసం పోరాడతారు. ఆ కోవకు చెందినవారే డా॥ నేరెళ్ల వేణుమాధవ్‌గారు. వీరి శిష్యులు శ్రీ సి. హెచ్. శ్రీనివాస్, శ్రీ యేటుకూరి పరమేశ్వర్‌రావు, శ్రీ కొండపల్లి మనోజ్‌కుమార్, శ్రీ హరికృష్ణ, శ్రీ సిల్వేస్టర్, శ్రీ జూ॥ వేణుమాధవ్ మొదలగువారు. ఇంకా అనేక మంది కళాకారులు దేశంలో దాదాపు 150 మంది ఈనాడు జీవనోపాధిని పొంది దేశంలోనే గొప్ప కళాకారులుగా జీవిస్తూ గౌరవ మర్యాదలు అందుకుంటున్నారు.

'కళ' తపస్సు లాంటింది. దీనిని కృషి, పట్టుదల మరియు అఖండమైన దీక్షతో సాధన చేసిన వారు గొప్ప కళాకారులుగా

> శ్రమ నీ ఆయుధమైతే విజయం నీ బానిసవుతుంది.
>
> \- గాంధీజీ

రూపొందుతారు. అంతే కాని గొప్ప కళాకారులు ఆకాశంలో నుండి ఊడిపడరు.

పరోక్షంగా సమాజమే వారిని తయారు చేస్తుంది. సమాజం నుండి స్ఫూర్తిని పొంది సమాజానికి సేవ చేస్తారు. సంక్లిష్టమయిన ఈనాటి జీవితంలో మనిషి ఎన్నో కష్టాలు, బాధల మధ్య నలిగి పోతున్నాడు. అతడ్ని గంటసేపు మైమరపించి నవ్వించడం కళాకారుడి ఉత్తమ కర్తవ్యం. పదిమందిని నవ్వించాలనే ఆశయం, నవ్వుతూ నవ్విస్తుండే సంకల్పం కలవారే ఈ మిమిక్రీ కళాకారులు.

మిమిక్రీ ఆర్టిస్ట్ యొక్క పురోభివృద్ధి అనేది అతని పరిశీలనా శక్తి **(Observation)**, సాధన పై ఆధారపడి ఉంటుంది. దీని కారణంగా అనేక రకాల కొత్త కొత్త అంశాలు **(items)** కనుక్కోవటానికి వీలవుతుంది. సూక్ష్మంగా ఆలోచించినప్పుడు చిన్న చిన్న అంశాలు కూడా ఎంతో సంతోషాన్నిస్తాయి.

**ఉదాహరణ :-**

**1)** స్టెతస్కోపుతో గుండె కొట్టుకుంటున్న శబ్దాన్ని విన్నప్పుడు సరిగ్గా అదేవిధంగా అనుకరించవచ్చును.

**2)** సినిమాలలో హీరోయిన్ 'ఏటి ఒడ్డు వెంబడి నడుస్తున్నపుడు' దానికి అనుగుణంగా వచ్చే సంగీత **(Music)** శబ్దాలను లయబద్దంగా అనుకరించవచ్చును.

**3)** సిల్క్ గుడ్డను చింపినపుడు వచ్చే శబ్దం ...

ధ్వన్యనుకరణ యొక్క పురోభివృద్ధి పరిశీలనా శక్తితో పాటు సాధనపై ఆధారపడి వుంటుంది.

- బొమ్మ శ్రీనివాస్

**4)** కాటన్ గుడ్డను చింపినపుడు వచ్చే శబ్దం ...

**5)** పాత చీకిపోయిన గుడ్డను చింపినపుడు వచ్చు శబ్దాలను వాటి తేడాలతో సహితం అనుకరించవచ్చును.

**6)** చాలా కాలం తరువాత హీరో తల్లిని చూడటానికి వచ్చినపుడు ఆవిడ చనిపోయి ఉంటుంది. ఇది మన తెలుగు సినిమాలలో గత **20** సంవత్సరాల నుండి హీరో ఏడుస్తూ 'అమ్మా...' అని అన్నప్పుడల్లా దానికి అనుగుణంగా వచ్చే సంగీతం **(Music)** విన్పించినపుడు, అభిమానులు ఎంతో పరమానందం పొందుతారు. ఇది **Observation** వలన మాత్రమే సాధ్యమవుతుంది.

మిమిక్రీ ...
పండిత, పామరులను రంజింపజేస్తుంది
ఆబాల గోపాలాన్ని ఒకేలా అలరింప జేస్తుంది
ఇది జనరంజకమైన కళ
దీనికి పద్యాలు - అనుపానాలు లేవు
హంగామా అసలే లేదు.
'మంచి మైకుంటే చాలు'

'మిమిక్రీ' కి ఎంత మంచి మైక్ ఉంటే ప్రోగ్రామ్ అంత నాణ్యత **(Quality)** కలిగి ఉంటుంది. మంచి మైక్ సిస్టమ్ ఉంటే ప్రోగామ్ ఒక విందు భోజనంలా వుండటమే గాక విన్నాకొద్దీ వినాలనే ఉత్సాహాన్ని పెంచుతుంది.

అందుకే ...

**'మనిషికి మెడకాయ మీద తలకాయ ఎంత అవసరమో**
**మిమిక్రీకి మంచి మైక్ అంత అవసరము'.**

---

ప్రపంచం ఒక నాటక రంగం. అందరూ భూమి అనే రంగస్థలం పైకి వచ్చి పోతుంటారు.

\- షేక్స్పియర్

---




నవ్వించేవాడు 'యోగి'
నవ్వేవాడు 'భోగి'
నవ్వనివాడు 'రోగి'

అన్నాడు ఓ మహానుభావుడు. నవ్వడం వలన మనిషికి ఎంత ప్రయోజనం ఉందో, నవ్వు ఆరోగ్యానికి ఎంత మంచిదో క్రింది ఉదాహరణ ద్వారా తెలుసుకొనవచ్చును.

ఇటీవల మన శాస్త్రవేత్తలు ఒక యూనివర్సిటీలోని విద్యార్థులపై ప్రయోగం చేశారు. 80 మంది విద్యార్థులను తీసికొని వారిని రెండు గ్రూపులుగా అనగా 40 మందిని 'ఎ' సెక్షన్ గాను, 40 మందిని ''బి'' సెక్షన్‌గాను విడగొట్టారు. 'ఎ' సెక్షన్ విద్యార్థులకు 30 రోజుల పాటు వారికి ఉన్న సిలబస్‌ను రోజూ ఐదు పీరియడ్స్ బోధించినారు. 'బి' సెక్షన్ విద్యార్థులకు వారు చదువుకుంటున్న సిలబస్ పక్కన పెట్టేసి 30 రోజుల

> పుడుతూ ఏడుస్తాం.
> చస్తూ ఏడ్పిస్తాం.
> ఈరెంటికి మధ్య కాలాన్ని,
> నవ్వటానికి – నవ్వించటానికి ప్రయత్నించు.
>
> – బొమ్మ శ్రీనివాస్

పాటు జోక్స్, మ్యూజిక్, డాన్స్, ఇలా ప్రతి రోజు 4 గంటల చొప్పున వినోదపు **(Entertainment Programes)** కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. 30 రోజుల తరువాత మొత్తం 80 మంది విద్యార్థులను వైద్య పరీక్షలకు పంపించినారు. వైద్య పరీక్షలు జరిపిన తరువాత రిపోర్ట్ చూసినపుడు 'ఎ' సెక్షన్ విద్యార్థుల కంటే 'బి' సెక్షన్ విద్యార్థులు శారీరక, మానసిక ఉల్లాసంతో పాటు, సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నారని, 'ఎ' సెక్షన్ వారు ఏదో మానసిక ఒత్తిడిలో ఉన్నట్లు, కొన్ని జబ్బులు కూడ ఉన్నట్లు శాస్త్రవేత్తలు నిర్ధారించిన తరువాత వారు ఇలా చెప్పారు.

'నవ్వడం వలన మానవుడు ఆరోగ్యంగా ఉంటాడని, నవ్వు ఆరోగ్యానికి ఒక టానిక్ లాంటిదని, ఒక్క క్షణం నవ్వితే నాలుగు క్షణాల అయుష్షు పెరుగుతుందని, నవ్వడం వలన 'ఎండార్ఫిన్' అనే ఎంజైమ్ విడుదల అవుతుందని, ఈ ఎంజైమ్ మానవున్ని మానసికంగా ఉల్లాసంగా ఉంచుతుందని చెప్పారు. మానవుడు మానసిక ఉల్లాసం కలిగి ఉన్నప్పుడే ఇతర ఎలాంటి జబ్బులు దరిచేరవని చెప్పడం జరిగింది.'

'మతం మనుషుల్ని వేరు చేస్తుంది.
కానీ ...
'కళ' ఆకర్షణతో మనుషుల్ని ఏకం చేస్తుంది.'

మీరు నవ్వండి. పదిమందిని నవ్వించండి. ఎందుకంటే కోటాను కోట్ల జీవరాశుల్లో నవ్వగలిగే ఒకే ఒక జీవి 'మానవుడు'.

సత్యం, శివం, సుందరాలతో కూడిన చైతన్య ప్రపంచాన్ని మానవునికి అందజేయడమే 'కళ' యొక్క లక్ష్యం.

- రవీంద్రనాథ్ ఠాగూర్




'ప్రకృతి భగవంతుని సృష్టి
కానీ ...
'కళ' ప్రకృతి సృష్టి' అన్నాడు అరిస్టాటిల్
కళలకు పుట్టినిల్లు ఓరుగల్లు నగరం
అక్కడే పుట్టారు డా॥ నేరెళ్ల వేణుమాధవ్ గారు.

వారు తయారు చేసిన సిలబస్‌ను మరింత విపులంగా, ఉదాహరణలతో, చక్కని డైలాగులతో, విశదీకరించడమే కాకుండా ఎన్నో వందల క్యాసెట్ల నుండి సేకరించిన డైలాగ్స్‌ను ఇందులో పొందు పరిచి చిన్న పిల్లలకు సహితం అర్థమయ్యేలా మిమిక్రీకి సంబంధించిన మెటీరియల్‌ను సవిస్తారంగా అందరికి అందుబాటులోకి తేవడమే ఈ పుస్తకావిష్కరణ యొక్క ముఖ్య ఉద్దేశ్యము.

> వట్టి మాటలు కట్టి పెట్టోయ్... గట్టి మేలు తలపెట్టవోయ్.
>
> \- గురజాడ అప్పారావు

మెకాలే ఏర్పాటు చేసిన చదువుల సిలబస్ మానవుని సహజ సిద్ధమైన శక్తులకు పెద్దగా దోహదం చెయ్యలేదు. ఆ చదువులు కేవలం గుమస్తా ఉద్యోగాలకే ఉపయోగపడ్డాయి. మరి ఈ కళకు సంబంధించిన చదువు మెకాలే ఏర్పాటు చేసిన సిలబస్‌లో లేదు. ప్రపంచ లైబ్రరీలలో ఎక్కడా ఈ కళకు సంబంధించిన పుస్తకాలు లేవు.

**Apple** పండు చెట్టునుండి రాలి కింద పడుతుందని అందరికీ తెలుసు. కాని న్యూటన్ అనే శాస్త్రవేత్త **Apple** పండు క్రింద పడగానే ఒక కొత్త విషయాన్ని కనుగొన్నట్లుగా పరమానంద భరితుడైనాడు. భూమికి ''గురుత్వాకర్షణశక్తి'' కలదు అనే నగ్న సత్యాన్ని కనుగొన్నాడు. ఇదంతా వివరించడములో ముఖ్య ఉద్దేశ్యం ఏమంటే అందరికీ తెలిసిన విషయాన్ని శాస్త్రవేత్తలు సైంటిఫిక్ గా చెప్తారు. సైంటిస్ట్ అయిన వారు శాస్త్రబద్ధంగా వివరిస్తారు. కానీ... కళాకారుడు తన అనుభవంతో, సాధనచేత, నిష్ఠచేత, ఒక కొత్త కళారూపాన్ని సృష్టిస్తాడు. అలా కొత్త రూపాన్ని ప్రజలు ఆదరించిన నాడు ఆ కళకు గాని, సైన్స్‌కు గాని అఖండ గౌరవం లభిస్తుంది. నృత్యాలలో అనేక నృత్యాలకు సిలబస్ ఉంది. లెక్కలు, జాగ్రఫి, కంప్యూటర్ ఇత్యాది మొదలగు వాటికి సిలబస్ ఉంది. మరి ఈ కళ **(Mimicry)** కి సంబంధించిన పుస్తకాలేమైనా ఉన్నాయా అని డా॥ నేరెళ్ల గారిని అడిగితే...

'ప్రపంచంలోని ప్రముఖ పట్టణాలలోని గ్రంథాలయాల పుస్తకాల కోటల్లో ఈ కళకు సంబంధించిందేమి దొరకలేదన్నారు. అంతే

కలం కంటే శక్తివంతమైన ఆయుధం లేదు.

– బుల్వార్ లిట్టన్

కాదు అనేక మంది మేధావులు, విమర్శకులు, కవులు, గాయకులు, రచయితలతో ముచ్చటిస్తే ఎవరూ ఇదిమిద్ధంగా ఏమీ చెప్పలేక పోయారని, ప్రతి ఒక్కరూ పశుపక్ష్యాదులను అనుకరించేంత వరకే పరిమితంగా చెప్పారని అన్నారు.'

అలాగే అనేక సంవత్సరాల అనుభవం వలన మిమిక్రీకి సిలబస్ వ్రాసే అవకాశం విశ్వవిఖ్యాత ధ్వన్యనుకరణ తపస్వి డా॥ నేరెళ్ల వేణుమాధవ్ గారికి దక్కింది. దానిని అనేక సంవత్సరాల అనుభవంతో మరింత విపులంగా వ్రాసే అదృష్టం నాకు దక్కడం ఆ ఏడుకొండల వెంకటేశ్వర స్వామి వరప్రసాదంగా భావిస్తాను.

మిమిక్రీ సిలబస్‌ను ఏడు భాగాలుగా వర్గీకరించవచ్చు. దానిని తరువాత పాఠంలో చుద్దామా!



పుస్తకం లేని గది హృదయం లేని దేహం వంటిది.

- హల్‌బ్రూక్ జాన్సన్




మిమిక్రీని మొత్తం 7 భాగాలుగా వర్గీకరించడమైనది. అవి

1. పశు, పక్ష్యాదులను అనుకరించడం
2. యాంత్రిక శబ్దాలను అనుకరించడం
3. నటీనటులు, గాయనీ గాయకులు, రేడియో మరియు టీ. వి. ఆర్టిస్టుల కంఠాలను అనుకరించడం
4. రాజకీయ నాయకులను అనుకరించడం
5. కవులు, పండితులు, విమర్శకులు మరియు రచయితలను అనుకరించడం
6. నిత్య జీవితంలోని మాండలికం (యాస) ను అనుకరించడం
7. వాయిద్యాల (**Instruments**)ను అనుకరించడం

> ఇతరులకు వెలుగునిస్తూ తాను హరించుకు పోయే క్రొవ్వత్తి లాంటివాడు గురువు.
>
> - రూఫిని

ఈ విధంగా పైన చెప్పిన 7 భాగాలను ఒకే ప్రోగ్రామ్‌లో వచ్చేలా ఎవరైతే అనుకరించి చూపించగలుగుతారో వారు పరిపూర్ణమైన మిమిక్రీ ఆర్టిస్ట్‌గా రూపొందుతారు. మిమిక్రీ కళాకారుడు సమయాన్ని సద్వినియోగ పరుస్తూ, సమయస్ఫూర్తితో, సందర్భానుసారంగా తనకు కేటాయించిన టైంలో తన కళను ప్రదర్శించగలగితే ప్రేక్షకుల ఆనందానికి అవధులు ఉండవు.



డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారి జన్మదిన వేడుక సందర్భంగా డా॥ సి. నారాయణరెడ్డి, మిమిక్రీ సి. హెచ్. శ్రీనివాస్ గారితో...

> జిజ్ఞాసాపరుల భావ సంపదయే సాహిత్యం.
>
> \- కార్లయిల్

# I



# పశు - పక్ష్యాదులను అనుకరించడము

సృష్టిలో కోటాను కోట్ల పశు - పక్ష్యాదులు మనుగడ సాగిస్తున్నాయి. వాటికి ప్రత్యేకమైన హావ భావాలూ, అరుపులూ వున్నాయి. ఇన్ని రకాల హావ భావాలను, అరుపులను అనుకరించి (imitation) చూపించడం అసాధారణమైన విషయం. అయినప్పటికినీ ఇన్ని అనుకరణలను చేసి చూపించాల్సిన అవసరం లేదు. ఎందుచేత నంటే ఒక సామాన్య మానవుడికి నిత్య జీవితంలో ఇవన్నీ తటస్థపడవు. అందుచేతనే అందరికీ తెలిసిన పశుపక్ష్యాదులను మాత్రమే పరిగణలోకి తీసుకుంటూ మిమిక్రీ కళాకారుడు అనుకరించి చూపించాల్సి వుంటుంది.

**i) 'కుక్క'** అరుపు శబ్దాన్ని సూక్ష్మంగా పరిశీలించి దానికి సంబంధించిన అనేక రకాల అరుపులను వైవిధ్యభరితంగా అనుకరించ వచ్చును.

> మర్రి విత్తనమంత చిన్న పద్యంలో మహావృక్షమంత
> అనుభవాన్నివ్వగల వాడే 'మహాకవి'.
>
> – బైరన్

a) కుక్క అరుపు ... బౌవ్... బౌవ్ (పెద్దగా శబ్దం చేస్తూ)

b) చిన్న కుక్క పిల్ల అరుపు ... వవ్... వవ్ (చిన్నగా శబ్దం చేస్తూ)

c) రాత్రి వేళల్లో కుక్క ఏడుపు ... బౌవ్వ్వ్వ్ ... (పొడిగిస్తూ)

d) కుక్కను కొట్టినపుడు...
కుయ్ఁ ... కుయ్ఁ... కుయ్ఁ... (మూలుగుతూ)

e) కుక్కల పోట్లాట... బౌవ్... వవ్ ... బౌవ్... వవ్ ...
(రెండు, మూడు కుక్కల అరుపులు అరుస్తూ )

ii) **'పిల్లి'** గొంతు నేర్చుకొన్నప్పుడు దానికి సంబంధించిన అరుపులు

a) పిల్లి అరుపు ... మియ్యాం... మియ్యాం ... (సాధారణంగా)

b) గండు పిల్లి అరుపు ... మియ్యాాం... మియ్యాాం ... (గంభీరంగా)

c) పిల్లుల పోట్లాట ...

iii) **'మేక'** లేదా **'గొర్రె'** గొంతును అనుకరించునపుడు దానికి సంబంధించిన అరుపులు

a) మేక అరుపులు ... మే... మే (సాధారణంగా)

b) చిన్న మేక పిల్ల ... మే ... మే... (సన్నగా)

c) గొర్రె అరుపు... మేఁ... మేఁ... (ముక్కుతో శబ్దం చేస్తూ...)

iv) **'ఆవు'** గొంతు అనుకరించినప్పుడు దానికి సంబంధించిన అరుపులు

| |
|---|
| సంగీతం మానవాళి అందరికి అర్థమయ్యే సార్వత్రిక భాష.<br>- ఒక సూక్తి |

a) ఆవు ... అంబా... అంబా
b) గేదె ... బాయ్ ... బాయ్...
c) దూడ ... అమ్మా... అమ్మా... (ముక్కుతో)

v) **ఇంకా అనేక రకాల జంతువుల అరుపులు :**
a) నక్క వూల పెట్టడం ... వవ్ వ్ వ్ వ్ వ్...
b) పాము బుస కొట్టడం ... బుస్ స్... బుస్ స్ ... (గాలితో)
c) ఎలుగుబంటి అరుపు ... హ్రూం...ఆ, హ్రూం...ఆ (ముక్కుతో)
d) గాడిద ఓండ్ర పెట్టడం ... వయ్యి ... ఆ, వయ్యి... ఆ (ఒక సౌండ్ బయటికి, రెండవ సౌండ్ నోటి లోపలికి పీల్చాలి)
e) గుఱ్ఱపు సకిలింపు ... కుయ్ య్ ... హ... హ... హ...
f) ఏనుగు ఘీంకారము ... హ హ్ర హ్ర హ్ర
g) సింహం గర్జన ... హుయ్... హుయ్... (ముక్కుతో గాలిద్వారా)
h) పులి గాండ్రింపు ... (గొంతుతో గాలిని లోపలికి పీల్చాలి)
i) కప్పల బెక బెకలు ... బెక్... బక్... బెక్... బక్...
j) అపుడే పుట్టిన పాప ఏడుపు... హుయ్యాం... హుయ్యాం... హుయ్యాం...

ఎవరి వద్ద ఆత్మ విశ్వాసం ఉంటుందో అది అతనికి అద్భుతమైన ప్రేరణను ఇస్తుంది.

\- మిల్టన్

అలాగే పక్షుల శబ్దాలను కూడ అనుకరించడము నేర్చుకోవాలి. అందులో

vi) **ముఖ్యమైన పక్షుల అరుపులు :**

a) బాతు ... క్వేక్... క్వేక్ (ముక్కుతో)

b) కోడి ... కో... కొ... కొ... కొ...

c) కోడి పుంజు... కొక్కొరకో...

d) కోడికి కొక్కు పట్టినపుడు ... కొ. కొ. కొ. కొ. (గంభీరంగా)

e) చిన్న చిన్న కోడిపిల్లల అరుపులు ... (విసిల్ వేసినట్లు చాలా చిన్నగా శబ్ధం చేస్తూ...)

f) గుడ్లగూబ ... ఉ... ఉ... ఉ... ఉ...

g) రామచిలుక ... పిచ్... పిచ్... చ్... చ్... చ్...

h) నెమలి... క్రౌం... వ్... వ్...

i) గ్రద్ద... కృం... కృం... (అని మూలుగుతూ)

ఈ విధంగా పైన చెప్పిన పశు - పక్ష్యాదుల అరుపులను నేర్చుకొని అనుకరించడం వలన దానికి సంబంధించిన సన్నివేశాలు, జోక్‌లు సృష్టించవచ్చును.

**ఉదాహరణలు :**

1. **కప్పలు** బెక్... బెక్... బక్... బక్ అని అరుస్తాయి. ఈ శబ్దాలను స్పీడ్‌గా అనుకరిస్తూ న్యాయం... న్యాయం... అన్యాయం... అన్యాయం అన్నట్లు భ్రాంతి ని కలిగించవచ్చును. ఈ విధంగా క్రియేటివిటి ఆర్టిస్టుకు అవసరం.

> దుర్గుణం లేకుండా ఇంద్రియ సౌఖ్యాన్ని ఇచ్చేది సంగీతం ఒక్కటే.
> – జాన్సన్

2. **ఆవు** అంబా అని అరుస్తుంది. ఈ శబ్దాన్ని ఆధారంగా చేస్కొని మిమిక్రీ కళాకారుడు తన మేదస్సు చేత, అనుభవం చేత క్రియేటివిటీ చేసి ఈ క్రింది విధంగా అనుకరించగలడు.

ఆవు అంబా... అంబా అని అరుస్తుంది. సినీ నటి రంభ వున్న ఒక వాల్ పోస్టర్ తిన్న ఆవు... రంభా... రంభా... అని అరిచినట్లు, ఇంకా కొద్దిగా వత్తి పలికి నగ్మా... నగ్మా... అని పలికినట్లు క్రియేటివిటీ చేసినపుడు హాస్యం ధ్వనించి మిమిక్రీ కళాకారుని సృజనాత్మకతకు ఎంతో ఆదరణ చేకూరుతుంది.

3. కోడిపెట్ట క్యూం... క్యూం... (ఎందుకు, ఎందుకు) అనీ లేదా కౌన్... కౌన్... (ఎవరు, ఎవరు) అని హిందీలో అన్నట్లు అనుకరించ వచ్చును.

పైన పేర్కొన్న విధంగా పశుపక్ష్యాదుల యొక్క అరుపులను ఆధారంగా చేస్కొని వాటికి సారూప్యత కలిగిన పదజాలాన్ని ఉపయోగించి మిమిక్రీ కళాకారులు కొన్ని రకాల జోక్స్ ఎలా క్రియేట్ చేయగలరో చూద్దామా!

4. **రెండు విభిన్న జంతువుల మధ్య జరిగే సంభాషణ :**

పొద్దున్నే పాలవాడు పాలుపోసి వెళ్లిపోతాడు. ఆ ఇంటి యజమాని పక్కనే ఒక చిన్నకుక్క పిల్ల కాపలా ఉంటుంది. ఈ కుక్క పిల్లకు ఇంగ్లీష్ వచ్చును. అయితే... ఒక పిల్లి వచ్చి ఆ కుక్కను హిందీలో ఇలా అడుగుతుంది.

> జాతీయ నాటక రంగం జాతి మనోభావాన్ని ప్రతిబింబించాలి.
>
> \- బెర్నార్డ్‌షా

**పిల్లి :-** 'మై ఆవూం... మై ఆవూం...' (నేను రావచ్చా)

అని గడప బయటి నుండి పాలు త్రాగటం కోసం కుక్కను అడుగుతుంది. అప్పుడు కుక్క, యజమాని ఉన్నాడని గ్రహించి పో... పో... అని అర్థం వచ్చేలా ఇంగ్లీష్‌లో ఇలా చెబుతుంది.

**కుక్క :-** గో... గో... గో...

ఈ జోక్ కుక్క, పిల్లి గొంతుల ఆధారంగా క్రియేట్ చేయడం జరిగింది. ఈ విధంగా జంతువులను ఆధారంగా చేస్కొని కొన్ని జోక్స్, అవి మాట్లాడినట్లు భ్రమింపజేయవచ్చును. అందుకే మిమిక్రీ కళాకారుడు అన్ని అంశాలను నేర్చుకోవాలి.

**5. విభిన్న మ్యానరిజమ్స్ (అలవాట్లు) వల్ల ఏర్పడే విచిత్ర పరిస్థితి :**

ఒక పశువుల డాక్టర్ పశువులకు వైద్యం చేసి చేసి అలసిపోయి ఇక మనుష్యులకు కూడా వైద్యం చేద్దామని ఒక క్లినిక్ పెట్టుకున్నాడు. క్లినిక్ బయట నుండి పేషెంట్ వస్తుంటే గతంలో పశువులకు వైద్యం చేసిన అలవాట్లు మరిచిపోలేక డాక్టర్ గారు ఇలా పిలుస్తున్నారు.

డాక్టర్ :- ఆవ్... దా... దా... దా... ఆవ్...!

పేషెంట్ :- అయ్యో బాబోయ్ నా కడుపునొప్పుండి బాబు...!

డాక్టర్ :- అవ్... అవ్...

పేషెంట్ :- నా కడుపు నొప్పుండి.

కంపౌండర్‌ను డాక్టర్ ఇలా పిలుస్తున్నాడు.

డాక్టర్ :- మేం... మేం... (మేక లాగ పిలుస్తూ)

> కళామతల్లిని తన యావచ్ఛక్తితో, నిస్వార్థంగా ప్రేమించాలి.
>
> \- స్టానిస్లవ్ స్కీ

కంపౌండర్:- వవ్... వవ్... వవ్... (కుక్కలాగా) అరుచుకుంటూ వస్తాడు.

ఇద్దరు కలిసి ఇంజక్షన్ చేస్తారు.

ఇక్కడ 'సూది' సౌండ్ సూస్ స్ స్... క్.

డాక్టర్:- ఆ... ఏమయ్యా ఇప్పుడెలా ఉంది...?

పేషెంట్:- అంబా... అంబా... అనుకుంటూ బయటికెళ్తాడు.

ఈ జోక్‌లో డాక్టర్, పేషెంట్, మేక, కుక్క, ఆవు మరియు సూదిసౌండ్ మొదలగు 6 రకాల అరుపులను లేదా శబ్దాలను ఆధారంగా చేస్కొని పరిపూర్ణంగా అనుకరించినప్పుడు ప్రేక్షకులు పరమానంద భరితులవుతారు.

**6) భాష రాక పోతే ఎలాంటి ఇబ్బందులుంటాయో ఒక జోక్ ద్వారా చూద్దాం!**

ఇద్దరు తెలుగువారు అరవం హోటల్‌కు వెళ్ళి బిర్యాని తింటూ, వారికి అనుమానం వచ్చి బేరర్‌ని పిలిచి ఇలా అడిగారు.

మొదటివాడు :- ఏమయ్యా, ఇది మేక మాంసమా?

బేరర్ :- ఎన్నా... అప్పా... ఎన్నా... సామీః!

రెండవవాడు :- ఏమయ్యా, ఇది కోడి మాంసమా?

బేరర్ :- ఎన్నా సామీః

ఇక వీడికి తెలుగు రాదని భావించి...

> హాస్యం మనస్సుకు అమృతం వంటింది.
> విషాదం విషంతో సమానం.
>
> – స్టానిస్లవ్ స్కీ

మొదటివాడు :- ఎన్నా సామీc... ఇది... మేc... మేc.. (మేకలాగ అరచి) ఆ మాంసమా?

బేరర్ :- కాదు అన్నట్లు తల ఊపాడు.

రెండవవాడు :- ఎన్నా సామీc ... ఇది కో... కో... కో... కో... (కోడిలాగా అనుకరించి) ఆ మాంసమా?

బేరర్ :- కాదు అన్నట్లు తల ఊపాడు.

ఇద్దరు :- మరి ఇది ఏ మాంసం అంటూ చేతిని నోటివద్దకు తీస్కెళ్ళి మాంసం చీల్చినట్లు సైగచేసి అడుగగానే...

బేరర్ :- సామీc... ఇదియా..., బౌవ్... బౌవ్... అంటూ వెళ్లిపోయాడు.

ఇలా భాషరాక పోతే ఎదుర్కొనే ఇబ్బందులను ఈజోక్ ద్వారా చెప్పొచ్చు. ఈ జోక్ మేక అరుపు, కోడిపెట్ట అరుపు, అరవము వాడు (బేరర్), మొదటి వ్యక్తి, రెండవ వ్యక్తి ఇలా **5** గొంతుల ఆధారంగా ఈ జోక్ క్రియేట్ చేయడం జరిగింది.

ఇలా సౌండ్స్, జంతువుల అరుపులు, పక్షుల అరుపులు ఎప్పుడు ఎలా ఉపయోగపడుతాయో చెప్పలేము. అలాగే జంతువుల అరుపులు కూడా. అందుకే మిమిక్రీ ఆర్టిస్ట్ అనేవాడు తప్పకుండా పశు -పక్ష్యాదులను అన్నింటిని నేర్చుకొని ఉన్నపుడు అనుభవంతో, సమయస్ఫూర్తితో యోచిస్తూ ఉంటే ఆయా సందర్భాలలో అవసరమయిన గొంతులను అనుకరించడం వలన విమర్శకుల మెప్పును

> జీవితం కంటే నటనా శిల్పం మరింకెంతో నిజమైంది.
> కనుక అదంటే నాకెంతో అభిమానం.
>
> \- ఆస్కార్ వైల్డ్



ఆదిగురువు పద్మశ్రీ
డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారికి
సన్మానం ''గండ పెండేర''
ప్రదానం చేస్తున్న
బొమ్మ శ్రీనివాస్



బొమ్మ శ్రీనివాస్‌ను మెమొంటోతో సత్కరిస్తున్న రఘుపతి వెంకయ్యా
అవార్డ్ గ్రహీత శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు గారు



రచయిత తల్లిదండ్రులు శ్రీమతి బొమ్మ కళావతి - శ్రీ వెంకటయ్య గారికి
సన్మాన అనంతరం పుస్తకం అంకితం ఇస్తున్నప్పటి చిత్రం



ఓరుగల్లు కళాపీఠం కన్వీనర్ శ్రీ దుస్సా చంద్రమౌళి గారు
రచయితను సన్మానిస్తున్నప్పటి చిత్రం

కూడా పొందుతాడు. ప్రేక్షకులు కూడా ఎంతో ఆనందపడతారు. చిన్న స్కూల్ ప్రోగ్రామ్ చేస్తున్నప్పుడు అనేక మంది చిన్న చిన్న పిల్లలు ఉంటారు. వారికి జోక్స్ అర్థం చేస్కొనేంత శక్తి, అవగాహన ఉండదు. అలాంటప్పుడు ఇలాంటి పశుపక్ష్యాదుల ఆధారంగా, కొన్ని సౌండ్స్ ఆధారంగా చిన్నపిల్లలకు బాగా అర్థమయ్యే విధంగా జోక్స్‌ని అనుకరించాలి. అలాంటప్పుడు చిన్నపిల్లలతో పాటు పెద్దలు కూడా ఎంతో ఎంజాయ్ చేస్తారు.

ఇలా పశు, పక్ష్యాదుల అరుపులను నేర్చుకొంటే ఇలాంటి అయిటమ్స్ ఇంకా ఎన్నైనా క్రియేట్ చేయవచ్చును. పై ఆరు ఉదాహరణల ద్వారా మీ అందరికి జంతువుల అరుపులతో సారూప్యత కల్గిన జోక్స్‌ని కుణ్ణంగా అర్థం అయ్యేలా ఇవ్వటం జరిగింది. మీ మీ ఆలోచనలను బట్టి మరిన్ని అయిటమ్స్ క్రియేట్ చేసుకొని ప్రదర్శించవచ్చును.

మిమిక్రీలో రెండవ భాగం అయిన సౌండ్స్ గురించి చర్చిద్దాము.



విశ్వంలో ఏదైనా తిరిగి రావచ్చు. కాలం తప్ప.

- గాంధీ

II



# యాంత్రిక శబ్దాలను అనుకరించడం.

మంచి మైక్ ఉండాలి గాని, మోటార్ వాహనముల శబ్దాలను అనుకరిస్తున్నప్పుడు ప్రేక్షకులు గనక ఏకాగ్రతతో విన్నట్లయితే నిజంగానే మోటారు వాహనాలు ఎదుటి నుండి వెళ్తున్నాయా అన్నంత భ్రాంతి కలుగుతుంది. మిమిక్రీలో సౌండ్స్‌కి అత్యంత ప్రాధాన్యత ఉంది. ఇందులో రైలు, విమానం, గుఱ్ఱపు డెక్కల చప్పుడు, పోలీసు జీపు సైరన్, యమహా బైక్, ఆటోరిక్షా, స్కూటర్, జీపు స్టార్ట్ చేస్తున్నపుడు (స్టార్టింగ్ ట్రబుల్‌తో సహా) కారు, బస్సు, లాంచి, హెలికాప్టర్, పిస్టల్ పేల్చినప్పుడు వచ్చే శబ్దం, నీటిలో రాయివేసినపుడు వచ్చే శబ్దం, మిషన్‌గన్ సౌండ్, ఈదరగాలి, ఎడారిలో గాలి మరియు తుఫాన్ వచ్చినపుడు వీచే గాలి శబ్దంతో పాటు ఇంకా అనేకానేక శబ్దాలను విన్పించవచ్చును. అంతేకాదు ఒక్కొక్క వాహనమును తీసుకొని వైవిధ్య భరితంగా దాదాపు **4,5** రకాలుగా శబ్దాలు వచ్చేలా మిమిక్రీ కళాకారుడు తన అనుభవాన్నంతటినీ రంగరించి ప్రేక్షకులను రంజింపజేస్తాడు.

> విశ్వంలో చాలా ఖరీదైన వస్తువు హృదయం.
> అందులో నుండి ఉద్భవించేదే కళ.
>
> - ఒక సూక్తి

# మొదటి పుస్తకావిష్కరణ చిత్రమాలిక



''మిమిక్రీ... మిమిక్రీ'' పుస్తకావిష్కరణ గావిస్తున్న
కాకతీయ యూనివర్సిటీ వైస్ చాన్సలర్ ప్రొ॥ శ్రీమతి విద్యావతి



''మిమిక్రీ... మిమిక్రీ'' పుస్తకాన్ని రచయిత శ్రీ బొమ్మ శ్రీనివాస్ కు
అందజేస్తున్న కాకతీయ యూనివర్సిటీ వైస్ చాన్సలర్
ప్రొ॥ శ్రీమతి విద్యావతి

## ఖమ్మం జిల్లాలో పుస్తక ద్వితీయ ముద్రణ ఆవిష్కరణ చిత్రమాలిక



ఖమ్మం జిల్లాలో ''మిమిక్రీ... మిమిక్రీ'' పుస్తక ద్వితీయ ముద్రణను ఆవిష్కరిస్తున్న మల్లెల బాబురావు *I.P.S.*




*గౌ॥ శ్రీ మల్లెల బాబురావు గారిని సత్కరిస్తున్న పుస్తక రచయిత బొమ్మ శ్రీనివాస్*

**ఉదాహరణ :-**

1. **రైలు (Train)**
   - a. స్టేషన్ నుండి బయలుదేరుచున్నప్పుడు...
   - b. దూరం నుండి దగ్గరగా వస్తున్నప్పుడు...
   - c. చిన్న చిన్న బ్రిడ్జిల మీద నుండి వెళ్తున్నప్పుడు...
   - d. పెద్ద బ్రిడ్జి పైనుండి పోవుచున్నప్పుడు...
   - e. రెండు రైళ్లు ఎదురెదురుగా వస్తున్నప్పుడు...

రైలు బయలుదేరునపుడు ప్లాట్‌ఫాం మీద చాయ్, కాఫి, పేపర్, పల్లి అమ్ముకునే వారి గొంతులు అనుకరిస్తూ...

**"You are attention please, No. 326 Kakatiya Fast Passenger is ready to leave from platform No.1."**

'కృపయా ధ్యాన్‌దీజియే... వరంగల్‌సే సికిందరాబాద్ జానేవాలీ కాకతీయ ఫాస్ట్ ప్యాసెంజర్ ఏక్‌నెంబర్ ఫ్లాట్ ఫామ్‌సే రవానా హోనేకేలియే తయ్యార్ హై!'

'దయచేసి వినండి. వరంగల్‌నుండి సికింద్రాబాద్‌వెళ్ళు నెం. **326** కాకతీయ పాస్ట్ ప్యాసింజర్ ఒకటవ నెంబర్ ఫ్లాట్‌ఫామ్ నుండి బయలుదేరుటకు సిద్ధంగా ఉంది.'

అని చెప్పి ముందు రైలు కూత, తరువాత పేడిపొగలతో పట్టాలపైకి గ్యాస్ లీక్ ఐన సౌండ్, ఆ తరువాత రైలు కదులుచున్న శబ్దాన్ని మెల్లి మెల్లిగా స్పీడ్ అందుకున్నట్లు అనుకరించినప్పుడు ప్రేక్షకుడు రైల్వే ప్లాట్‌ఫామ్ పై వున్న అనుభూతిని పొందుతాడు.

> సోమరిపోతు దొంగతో సమానం.
>
> \- రూసో

**2. విమానం (Aeroplane) :**

a. ఎరోడ్రమ్ నుండి పైకి లేస్తున్నపుడు...

b. 500 అడుగుల పై నుండి దగ్గరగా వస్తున్నపుడు...

c. 2000 అడుగుల పై నుండి వెళ్ళుచున్నపుడు...

d. ఎరోడ్రమ్ లో దిగుచున్నపుడు...

**3. గుఱ్ఱము (Horse) :**

a. ధార్ రోడ్‌పై నుండి వెళ్ళుచున్నపుడు డెక్కల చప్పుడు...

b. సిమెంట్ రోడ్‌పై నుండి వెళ్ళుచున్నపుడు డెక్కల చప్పుడు...

c. ఇసుకలో నుండి వెళ్ళుచున్నపుడు డెక్కల చప్పుడు...

గుఱ్ఱపు డెక్కల చప్పుడు అనుకరించి చివరికి గుఱ్ఱము 'సకిలింపు' శబ్దాన్ని కూడా జోడించినపుడు ప్రేక్షకులు మరింత ఆనందపరవశులౌతారు.

**4. ఆటోరిక్షా :**

a. ఎత్తు నుండి పల్లానికి వచ్చేటప్పుడు...

b. పల్లం నుండి ఎత్తుకు వెళ్ళేటప్పుడు...

వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా వుండే పోలీసు జీపు సైరన్ శబ్దాలను రాబోయే పాఠంలో చూడవచ్చు.

> కళకి విలువ తెచ్చేది అందం కాదు, సదాచారం.
>
> - సోమర్‌సెట్ మామ్

రెండు శబ్దాలను ఒకేసారి కూడా వినిపించవచ్చును. పై నుండి విమానం, క్రింది నుండి గుఱ్ఱపు డెక్కల సౌండ్‌ని ఏకకాలంలో అనుకరించవచ్చును. అలాగే రైలు, గుఱ్ఱము రెండు పక్కపక్కనే వెళ్ళుచున్నపుడు వచ్చే శబ్దాలను విన్పించినపుడు ప్రేక్షకులు కరతాళ ధ్వనులతో అభినందిస్తారు.

సౌండ్స్‌ని ఆధారంగా చేస్కొని టెన్‌కమాండ్‌మెంట్స్, స్టార్‌వార్స్, మెకానస్ గోల్డ్, జురాసిక్ పార్క్ లాంటి మేటి హాలీవుడ్ చిత్రాల సన్నివేశాలను కూడా కళ్ళకు కట్టినట్లు వినిపించవచ్చును.

స్కైలాబ్ పడేందుకు సిద్ధంగా వున్న విషయం తెలుసుకొన్న ప్రజలు భయభ్రాంతులై మాట్లాడే మాటలు వారి హావ, భావాలతో యుక్తంగా అనుకరించవచ్చును. అంతేకాక బ్యాంక్ దోపిడి, ఇండియన్ న్యూస్ రివ్యూ మరియు రెండవ ప్రపంచ యుద్ధ సన్నివేశాలనే కాక కార్గిల్ యుద్ధం సైతం ఎలా జరిగిందో ఊహించి అనుకరించినప్పుడు ప్రేక్షకులు ఫోన్స్ చేసి మరీ అభినందించిన సంఘటనలు ఎన్నో వున్నాయి.

**ఉదాహరణ :-**

**5. ఇండియన్ న్యూస్ రివ్యూ :**

ఆంజనేయశాస్త్రి :- **1964.** అస్సాంలో తుఫాన్ భీభత్సం.
(తుఫాన్ వచ్చినపుడు గాలివీచే సౌండ్ అనుకరించాలి.)

ఆంజనేయశాస్త్రి :- అశేష ధన, ప్రాణ నష్టం.

> నిగూఢమైన అంకగణిత అభ్యాసనమే సంగీతం.
>
> – లైబ్నిట్జ్

చనిపోయినపుడు సినిమాలలో వచ్చే సౌండ్‌ని
అనుకరించాలి. (కుయ్ఁ య్ఁ య్ఁ య్ఁ కుయ్)

ఆంజనేయశాస్త్రి :- భారత్ ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ
హెలికాప్టర్‌లో సందర్శించారు.
(హెలికాప్టర్ వస్తున్న సౌండ్ అనుకరించాలి.)

ఆంజనేయశాస్త్రి :- **1964.** శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ మరణించారు.
ఆ తరువాత ఎన్నికైన భారత్ ప్రధాని
శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మాట్లాడుతూ...

శాస్త్రి :- దోస్తో! హమ్ గాలీ... కా జవాబ్, గాలీ... సె దేంగే.
హమ్ గోలీకా జవాబ్ గోలీసె దేంగే...
అయూబ్ ఖాన్‌సే మైఁ కద్ మేఁ ఛోటాహూఁ ...
మగర్ బుద్ధిమేఁ కమ్‌కుచ్ నహీఁహూఁ.

ఆంజనేయశాస్త్రి :- **1995.** భారత్ ప్రధాని శ్రీ పి.వి. నర్సింహారావు
ఇటీవల వరంగల్ సందర్శించారు. ఆ సందర్భంగా
సమస్యల గురించి మాట్లాడుతూ...

పి.వి. నర్సింహారావు :- సమస్యల గురించీ... ఆలోచించాల్సిన అవసరం
లేదూ... సమస్యలు అనేవి ఎప్పటికీ ఉంటాయీ...
ఏ పార్టీ వచ్చినా, ఈ సమస్యలనేవి ఉంటాయి.
**3** సంవత్సరాల పాటు ఈ సమస్యలని పక్కకు పెట్టి
దేశాభివృద్ధికి పాటుపడాలి.

ఆంజనేయశాస్త్రి :- అని శ్రీ పి.వి. నర్సింహారావు అన్నారు.
**1999.** ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా

> ప్రేమయున్న చోటనే జీవితం ఉంటుంది.
> ద్వేషం ఉన్నచోట నాశనం తప్పదు.
>
> – గాంధీ

చంద్రబాబు నాయుడు ఒక సభలో మాట్లాడుతూ...

చంద్రబాబు నాయుడు :- రాష్ట్ర ప్రజలందరికీ నా హృదయ పూర్వక జన్మభూమి శుభాకాంక్షలు తెలియజేస్కొంటున్నాను. నా ప్రజలే నాకు దేవుళ్లు. వాళ్ల సేవలోనే నాజన్మభూమి తరిస్తుందనే నమ్మకంతో, నేను జన్మభూమి లాంటి అనేక కార్యక్రమాల ద్వారా, ప్రజల్లో ఒక విధమైన చైతన్యాన్ని తీస్కొచ్చానని మీకు తెలియజేస్కొంటున్నాను.

నేను ఒక్కడినే కష్టపడి పని చేస్తున్నాను. మీరందరు కష్టపడి పని చేయాలి. అలా చేసినట్లయితే, మన రాష్ట్రం ఒక ఆదర్శ రాష్ట్రం అవుతుందని మనవి చేస్కొంటున్నాను.

ఈ విధంగా ఒక సన్నివేశం క్రియేట్ చేయవచ్చును. ఇందులో ఆంజనేయశాస్త్రి, తుఫాన్ సౌండ్, చనిపోయినపుడు మ్యూజిక్, హెలికాప్టర్ సౌండ్, లాల్ బహదూర్ శాస్త్రి, పి.వి. నర్సింహారావు, చంద్రబాబునాయుడు ఇలా 7 రకాల గొంతులను అనుకరించడము జరిగింది. ఇలా అన్నీ వివరించాలంటే ఇదో పుస్తకం తయారవుతుంది. మీమీ ఆలోచనలకు అనుగుణంగా మరిన్ని అయిటమ్స్ తయారు చేస్కొంటారని ఆశిస్తూ....

పశుపక్ష్యాదులను, సౌండ్స్‌ని ముందే ఎందుకు నేర్చుకోవాలో తరువాత పాఠంలో చర్చిద్దాం.

మానవునకు తెలిసిన అన్ని రోగాలలోను చికిత్సకు లొంగనిది అహంభావం. కళాకారునికి అహంభావం ఎప్పుడైతే వస్తుందో పతనం మొదలవుతుంది.

- ఫ్రాడ్

C



# సంసిద్ధత (READYNESS)

వ్యక్తిలో మిమిక్రీ కళ సహజంగా ఉండి నేర్చుకొనుటకు సంసిద్ధంగా ఉన్నప్పుడే ఆ కళను నేర్చుకొనగలుగుతాడు. అనగా ఆ కళను నేర్చుకొనుటకు అన్ని విధాల తయారై ఉండడమన్నమాట. మ్యాథమేటిక్స్ విద్యార్థికి కంప్యూటర్, ఫిజిక్స్ నేర్చుకోవడం సులభంగా ఉంటుంది. అదే లాంగ్వేజి చదివిన విద్యార్థికి కష్టంగా ఉంటుంది. అయితే మ్యాథమేటిక్స్ విద్యార్థి కంప్యూటర్ గాని, ఫిజిక్స్ గాని నేర్చుకోవడానికి అయిష్టంగా ఉన్నప్పుడు వాటిని నేర్చుకొనలేడు. అంటే ముందు ఏదైనా నేర్చుకోవలెనంటే ఆ సబ్జక్ట్ పట్ల, ఆ కళ పట్ల శ్రద్ధ, ఆసక్తి, ఉత్సాహం కుతూహలంతో పాటు సంసిద్ధత ఉండాలి. దీనిని ఒక్కమాటలో చెప్పాలంటే 'గుఱ్ఱమును నీళ్ళవరకు తీస్కోళ్ళ వచ్చును కానీ నీటిని తాగించలేము' అనే సామెతతో పోల్చి చెప్పవచ్చును.

కనుక మిమిక్రీ నేర్చుకోవాలనే తపన, కుతూహలం, ఉత్సాహం, ఆసక్తి ఉన్నప్పుడే మిమిక్రీ అభ్యసనం సులభం అవుతుంది. అప్పుడు మిమిక్రీ కళకు సంబంధించిన ఫలితాలు సంతృప్తికరంగా ఉంటాయి.

> క్రోధం, పగ ఇవి నీచ మానవ ప్రవృత్తికి చెందినవి. వీటిని విసర్జించుము.
>
> – అరవిందుడు

**D**



# సాధన (PRACTICE)

మిమిక్రీ కళాకారుడు ఒక సన్నివేషాన్ని కాని, ఒక సౌండుని కాని, ఒక వాయిస్‌ని గాని ఉన్నది ఉన్నట్లు అనుకరించగల్గుతున్నాడంటే దాని వెనుక అతని 'సాధన' ఎంతో ఉంటుంది. అందుకే **Practice Makes Perfect** అన్నాడొక మహానుభావుడు. ఈ సామెత 'మిమిక్రీ కళకు' పూర్తిగా సరితూగుతుంది.

ఒక కొత్త సన్నివేశం చూసినప్పుడు గాని, విన్నప్పుడుగాని ఆ సన్నివేశం ఉన్నది ఉన్నట్లుగా అనుకరించాలంటే కొందరికి ఒకటి, రెండు సార్లు సాధన చేస్తే రావచ్చు. మరికొందరికి ఒక్కొక్కసారి 70-80 సార్లు ప్రాక్టీస్ చేస్తేగాని స్పష్టంగా విన్పించలేరు. ఎందుకంటే ఆ సన్నివేశానికి సంబంధించిన సౌండ్స్, గొంతులు అతని గొంతుకు సారూప్యత (దగ్గరి సంబంధం) కలిగి ఉన్నప్పుడు తొందరగా అనుకరించగలడు. భిన్నంగా ఉన్నప్పుడు ఎక్కువ సార్లు సాధన చేయాల్సి ఉంటుంది. మిమిక్రీ కళలో సాధన లేకుండా ఏ ఐటమ్‌ను స్టేజిపై విన్పించలేము. కనుక ఈ కళ పూర్తిగా సాధనపై ఆధారపడి ఉంటుం... స్పష్టంగా చెప్పవచ్చును.

> నిరక్షరాస్యత మనదేశానికి తలవంపులు తెస్తున్న కళంకం. దీనిని నిర్మూలించి తీరాలి.
>
> \- గాంధీ

E



# ప్రేరణ (INSPIRATION)

మిమిక్రీ అభ్యసనానికి 'ప్రేరణ' రాచబాట వంటిది. ప్రేరణ అనేది ప్రధానంగా నాలుగు అంశాలపై ఆధారపడి వుంటుంది. అవి ప్రోత్సాహం, పొగడ్త, అభినందన, బహుమతి. ఇవన్నీ లభించినపుడు మిమిక్రీ అభ్యసనం చూరుకుగా జరుగుతుంది.

ఒక వ్యక్తి తన కృత్య నిర్వహణలో చూపించే శక్తి లేదా ఉత్సాహం పెంపొందించడానికి కానీ లేదా తగ్గించడానికి దోహదం చేసే కారకాలను 'ప్రేరణ' అని 'డీసెకో' చాలా చక్కగా అభివర్ణించాడు.

మిమిక్రీ నేర్చుకొనే విద్యార్థులకు విద్యాబోధన చేసే ముందు వారిలో ప్రేరణ కలిగించవలెను. మిమిక్రీ ఎందుకు నేర్చుకొంటున్నామో దాని వలన ఎలాంటి ప్రయోజనాలున్నాయో ముందు తెలుపవలెను. ఒక ఆర్టిస్ట్ ఒక ప్రోగ్రామ్ ఇచ్చాడనుకుందాం. ఆ ప్రోగ్రామ్ వలన అతనికి సమాజము నుండి అంటే ప్రేక్షకుల నుండి అనేక ఉద్దీపనలు వస్తాయి. వాటికి వ్యక్తి (కళాకారుడు)

న్యాయం గెలుస్తుందన్న మాట నిజమే. కాని గెలిచిందంతా న్యాయం కాదు.

- శ్రీశ్రీ

ప్రతిస్పందిస్తాడు. ఈ ఉద్దీపనా - ప్రతిస్పందనల మధ్య మిమిక్రీ అభ్యసనం కొనసాగింపబడుతుంది. ఈ విధంగా కొనసాగింపబడిన అభ్యసనము చివరికి అతని అవసరాలతో ముడిపడి ఉంటుంది. ఈ విధంగా ఒక మంచి ప్రేరణ వలన ఒక సమాజం మంచి కళాకారున్ని సంపాందించుకోవచ్చు లేదా చెడు ప్రేరణ **(Negative Inspiration)** కలిగించి ఒక మంచి కళాకారున్ని కోల్పోవచ్చు.



నీరు ఎంత అమూల్యమైనదో, బావి ఎండిపోయే వరకు తెలియదు.

- థామస్ ఫుల్లర్




మిమిక్రీ నేర్చుకొనేవారికి ముందుగా వచ్చే అనుమానం **(doubt)** ఏమంటే పశువుల అరుపులు, పక్షుల కిలకిల రావాలు మరియు మోటర్ వాహనాల శబ్దాలే ముందుగా ఎందుకు నేర్చుకోవాలి? వాటిని ఈ కాలంలో ఎవరు వింటున్నారు? డైరెక్ట్‌గా మాకు సినీయాక్టర్ల, రాజకీయ నాయకుల గొంతులను నేర్పించండి అని మిమిక్రీ నేర్చుకొనే విద్యార్థులు అంటుంటారు.

ఒక్క క్షణం ఆలోచించండి. పునాది లేకుండా బిల్డింగ్ కట్టగలమా? కరాటే నేర్చుకొనే విద్యార్థికి ముందు వామ్‌అప్, ఎక్సర్‌సైజ్‌లు ఉంటాయి. అలా నేర్చుకొంటేనే కొద్ది నెలల్లో కటాస్ నేర్చుకోగలుగుతాడు. డైరెక్టుగా కటాస్ నేర్పిస్తే అవి ఎక్కువ కాలం గుర్తుండక పోవడమే కాక పద్ధతి తప్పి చేయాల్సిన పరిస్థితి ఉంటుంది. అంటే కరాటేకు ఆధారం **(base)** ఈ చిన్న చిన్న ఎక్సర్‌సైజ్‌లు మాత్రమే.

> ప్రపంచమందు నీకు వేరే శత్రువుగాని, మిత్రుడు గాని లేడు. నీ నడవడికయే నీకు మిత్రులను గాని, శత్రువులను గాని లభింపజేస్తుంది.
>
> – చాణిక్యుడు

మిమిక్రీ... మిమిక్రీ...

అంతెందుకు సంగీత కచేరీ చేసేవారు ముందు స... రి... గ... మ... ప... ద... ని... స నుండి ప్రాక్టీస్ చేయాల్సిందే. అలాగే ఈ మిమిక్రీ నేర్చుకోవాలంటే ముందు పశు, పక్ష్యాదులను, సౌండ్స్‌ని నేర్చుకోవాల్సిన అవసరం చాలా ఉంది. ఎందుకంటే మిమిక్రీ 'కళ' చాలా వరకు చైన్ సిస్టమ్ పై ఆధారపడి ఉంటుంది.

'చైన్‌సిస్టమ్' అంటే గొలుసు పద్ధతి. అనగా మిమిక్రీలో ఒక గొంతుని అనుకరిస్తే దానికి సారుప్యత కలిగిన అనేక గొంతుల్ని అనుకరించ వచ్చును. ఇదంతా ఒక గొలుసులా ఒకదానితో ఒకటి మిళితమై ఉండటం వలన దానికి సంబంధించిన అనేక దగ్గరి గొంతుల్ని సులువుగా అనుకరించవచ్చును.

**I. ఉదాహరణ :**

**'హ' ఆధారంగా వచ్చే గొంతులు :**

'హ' అనే అక్షరాన్ని 'హ' అని గాలి వచ్చేలా పలికినపుడు దానికి సంబంధించిన గొంతులు గుడ్లగూబ, ఎడారిగాలి, న్యూస్‌రీడర్ మావిళ్లపల్లి రాజ్యలక్ష్మి, భారత్ రెండవ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ మరియు సినీనటుడు అక్కినేని నాగార్జున గొంతులను అనుకరించ వచ్చును.

1. **గుడ్లగూబ :** హు... హు... హు...

2. **ఎడారి గాలి :** - హు ... హ... హౌ... హు... (గాలితో)

అలవాట్లను అదుపులో పెట్టకపోతే అవసరాలై కూర్చుంటాయి.

- సెయింట్ ఆగస్టీన్

3. **మామిళ్లపల్లి రాజ్యలక్ష్మి** :- ఆకాశవాణి వార్తలు చదువుతుంది మావిళ్లపెల్లి రాజ్యలక్ష్మి. నేడు హైదరాబాద్ హుస్సేన్‌సాగర్ మీదుగా ప్రయాణించాల్సిన ఒక దోమల గుంపు మధ్యాహ్నాం వరంగల్ మీదుగా, సాయంత్రానికి విజయవాడ చేరుకుంటాయని వార్తా సంస్థల బోగట్టి. ఈ వార్తలు ఇంతటితో సమాప్తం.

4. **సర్వేపల్లి రాధాకృష్ణన్** :- (1962 మే 13 నుండి 1967 మే 13 వరకు భారత రెండవ రాష్ట్రపతి)

**A) English:- Today our country is celeberating independance day, with pleasure, on this occasion, I wish all my countrymen, a prosperous and happy future.**

సర్వేపల్లి గారు శ్రీ నేరేళ్ళ గారితో అన్న తెలుగు మాటలు ...

**B) Telugu :-** 'ఇంగ్లీషులో మాట్లాడి, మాట్లాడీ విసుగొచ్చింది. మీరు తెలుగులో మాట్లాడండి'.

5) **అక్కినేని నాగార్జున** : అలేఖ్యా! నువ్వులేనిది నేను బ్రతకలే నలేఖ్యా ! (మజ్ను చిత్రంలో డైలాగ్)

ఈ విధంగా ఒక గొంతు నేర్చుకొంటే దానికి సారుప్యత (**relationship**) కలిగిన అనేక గొంతులు మిమిక్రీ కళాకారుల మేదస్సులో ఒక 'రీల్' లాగా తిరుగుతుంటాయి. ఏయే గొంతులు

---

ఒక యింట ఇద్దరు సవతులు వుండటం ఒక బోనులో రెండు పులులు వున్నట్టే.

- మలేషియన్ సామెత

---

ఏస్థాయిలో పలుకాలో! ఏయే గొంతులు ఎవరిగొంతుకి దగ్గరగా (సారూప్యత) ఉంటాయో యోచిస్తూ ఉంటే ఇదంతా సాధన చేత కంటే ముఖ్యంగా 'అనుభవం' చేతనే వస్తుందని అవగతమవుతున్నది.

**II. ఉదాహరణ :-**

**తుఫాన్ గాలి హోరు ఆధారంగా వచ్చే శబ్దాలు :**

1) 120 కి. మీ. వేగంతో వీస్తున్న తుఫాన్ గాలి శబ్దాన్ని అనుకరించినపుడు దానికి సంబంధించిన అనేక గొంతులను అనుకరించవచ్చును. ఈ సౌండ్ ఆధారంగానే క్రికెట్ ఆడుతూ సిక్సర్ కొట్టినప్పుడు ప్రేక్షకుల హర్షధ్వానాలను అనుకరించవచ్చును.

2. 'తలుపు' (Door) తీస్తున్నప్పుడు వచ్చే శబ్దాన్నే కాకుండా, తలుపు వేస్తున్నప్పుడు వచ్చే శబ్దాన్ని కూడ అనుకరించ వచ్చును.

3. 'జీపు' (Geep) స్పీడ్ గా వెళ్తూ మలుపు తిరిగినపుడు వచ్చే శబ్దాన్ని కూడ అనుకరించవచ్చును.

4. వాజ్‌పేయి లేదా సోనియాగాంధీ హెలికాప్టర్‌లో వచ్చినపుడు ప్రజలంతా ముక్తకంఠంతో 'జిందాబాద్... జిందాబాద్' అనే శబ్దాలను అనుకరించవచ్చును.

5. 'లారీ' (Lorry) ని సడెన్ బ్రేక్ వేసినపుడు వచ్చే శబ్దాన్ని కూడ అనుకరించవచ్చు.

కళ ఒక సాధనం .
జన చైతన్యానికి అదొక ఆయుధం.

– ఒక సూక్తి

## III. ఉదాహరణ :-

### 'ముక్కు' ఆధారంగా వచ్చే గొంతులు :

1) పోలీసు జీపు సైరన్: ఇది మూడు రకాలుగా వుంటుంది.

a) తెలుగు సినిమాలలో పోలీసు జీపు సైరన్...
కుయ్‌య్‌య్... కుయ్‌య్‌య్...

b) మాద్రే అను పట్టణంలో పోలీసు జీపు సైరన్
కుహు...హు... హు... హు... (పిల్లాడు ఏడుస్తూ అలిగినట్లు)

c) అమెరికాలో పోలీసు జీపు సైరన్
కుయ్... కుయ్... కుయ్... కుయ్... (మ్యూజిక్‌లా)

d) అలాగే దీనినే బేస్ వాయిస్‌గా తీస్కొంటే విమానం 2000 వేల అడుగుల పై నుండి వెళ్తున్నప్పుడు వచ్చే శబ్దాన్ని అనుకరించవచ్చును.

2) **కీ॥శే॥ ఉషశ్రీ :**

ఈయన రేడియోలో ప్రశ్నలకు సమాధానాలిస్తుండే వారు.

**ప్రశ్న** :- 'అయ్యా గురువు గారు... గుంటూరు నుండి శనీశ్వర్రావు గారు అడుగుచున్నారు. వారు ఆపరేషన్‌చేయించుకున్నాక కూడా పిల్లలు పుడుతున్నారట. దీనికి కారణం ఏమిటని అడుగుచున్నారు.'' అనగానే ఉషశ్రీ గారు సరదాగా...

> కళలో ఆకస్మికాలు లేవు.
> నిర్విరామ కృషి యొక్క ఫలాలు మాత్రమే వున్నాయి.
> - స్టానిస్లవ్స్కి

'శ్రీ గురుభ్యోనమహః, సమస్త సమంగళనిభవతుః'
ఈ ఆపరేషన్ అనేది చేయించుకున్నాక ఇక పిల్లలు పుట్టకూడదు.
అయినా నువ్వు పుట్టారని చెబుతున్నావు గనక
నీపేరులోనే ఉంది శనంతా!
ఆపరేషన్ నువ్వు ఒక్కడివే కాదు.
మీ ఇంటి చుట్టు పక్కలవారు కూడా చేయించుకుంటే మంచిది నాయనా.
అంటూ సరదాగా సమాధానమిస్తుంటారు.

**3) నూతన్ ప్రసాద్ (సినీనటులు) :**

యాఁవ్... దేశం చాలా క్లిష్టపరిస్థితుల్లో ఉంది. యాఁవ్... Left నుండి సమ్మెలు, right నుండి దోపిడీలు, front నుండి వ్యభిచారాలు, back నుండి స్కాములు మనదేశాన్ని పట్టి పీడిస్తున్నాయి. యాఁవ్... అంచేత ఈ హాల్లో మగపురుగు అనేది కనిపిస్తే చాలు వ్యానెక్కించేయండి అంతే. యాఁవ్...

**4) కీ॥శే॥ కందుకూరి సూర్యనారాయణ (న్యూస్ రీడర్) :**

ఆకాశవాణి వార్తలు చదువుతుంది కందుకూరి సూర్యనారాయణ. క్లింటన్ నేడు మనదేశ విమానాశ్రయంలో దిగుతూ ఉండగా ఆయన్ని రెండు దోమలు కుట్టినాయ్. ఆరెండు దోమలను పట్టుకున్న వారికి ప్రభుత్వం రెండు లక్షల రూపాయలను బహుమతిగా ప్రకటించింది. ఆకాశవాణి ఇప్పుడే అందిన వార్త. ఆ రెండు దోమల్ని పీపుల్స్‌వార్ నక్సల్స్ మందుపాతరతో పేల్చి చంపినట్లు వార్తా సంస్థల బోగట్టా.

| |
|---|
| ప్రకృతియే కళను నేర్పింది.<br>- మిల్టన్ |

**5) ముఖేష్ (హిందీ గాయకులు)**:- జీనా యహాc, మర్నా యహాc, ఇస్‌కే సివా జానా కహాc...

ఈ విధంగా ఒక గొంతు నేర్చుకొంటే దానికి సారూప్యత కలిగిన అనేక ఇతర గొంతులను అనుకరించవచ్చునని వివరించడం జరిగింది. మొదటి ఉదాహరణలో ఐదు, రెండవ ఉదాహరణలో ఐదు, మూడవ ఉదాహరణలో ఐదు గొంతులను, వాటికి సంబంధించిన డైలాగులను ఇవ్వడము జరిగింది. దీన్నిబట్టి మిమిక్రీ కళ ఒక గొలుసు (**chain system**) లాగా, ఒక దానిపై ఒకటి ఆధారపడి ఉంటుందని అవగతమవుతున్నది.

కావున మిమిక్రీ నేర్చుకొనే ప్రతి కళాకారుడు ముందు పశు, పక్ష్యాదుల అరుపులను, మెకానికల్ సౌండ్స్‌ని తప్పకుండా నేర్చుకొంటే వాటికి దగ్గరలో ఉన్న సినీ కళాకారుల గొంతులను, రాజకీయ నాయకుల గొంతులను అనుకరించడానికి సులభంగా ఉంటుంది. ఏ గొంతు ఎప్పుడు ఎలా ఉపయోగపడుతుందో చెప్పలేము. కావున మిమిక్రీ కళాకారులు అందరూ అన్ని ఐటమ్స్ నేర్చుకోవలసిందే! పశు పక్ష్యాదులను అనుకరించడం అనే చాప్టర్‌లో సారూప్యత కలిగిన జోక్స్ విపులంగా ఇవ్వడం జరిగింది. మిమిక్రీ కళాకారుడికి పై అన్ని ఐటమ్స్ వచ్చినపుడే ఒక సన్నివేశం మొత్తం అనుకరించగలడు. ఆ సన్నివేశంలో ఉన్న పశుపక్ష్యాదుల, సౌండ్స్‌ని, వ్యక్తుల గొంతులను అనుకరించినపుడు ప్రేక్షకులు పరమానంద భరితులు అవుతారు.

> చర్చిలో మతగురువు ప్రభోదన చేసే పరిశుద్ధ స్థలం లాంటిది ఆధునిక మానవుడికి నేటి నాటక రంగం.
>
> \- గోర్కీ

మిమిక్రీ... మిమిక్రీ...

మిమిక్రీ కళాకారులు నటీనటుల, గాయనీ గాయకుల, రేడియో ు టి. వి. కళాకారుల కంఠస్వరాలను ఎలా అనుకరించాలో మిమిక్రీ లోని మూడవ భాగములో చర్చిద్దాం.



'ఇండియన్ న్యూస్‌రివ్యూ' చాలాబాగుందని అభినందిస్తున్నా పద్మవిభూషణ్ కాళోజి నారాయణరావు గారు...

న మనస్సు ఎప్పుడూ పెట్టని కోట.
ది దెబ్బ తింటే జీవితం అనే సమరంలో ఓడిపోతాం.

– రాజాజీ

# III



# నటీనటులు, గాయనీ గాయకులు, రేడియో మరియు టి.వి. ఆర్టిస్టులను అనుకరించడం

నటీనటులను, గాయనీ గాయకులను, రేడియో మరియు టీ.వి. కళాకారులను అనుకరించడం మిమిక్రీ రంగంలో అత్యంత ప్రధానమైన ఘట్టం. మిమిక్రీ కళాకారుని నైపుణ్యత, అతను పడిన కష్టము ( శ్రమ) ప్రేక్షకుడికి ఇక్కడ స్పష్టంగా తెలుస్తుంది. వీరిని అనుకరించడము ఎలా నేర్చుకోవాలంటే...?

ముందు ఏ కళాకారుడిని అనుకరించదల్చుకున్నారో ఆ కళాకారుని డైలాగు సేకరించి అవపోసన ( బట్టీ) పట్టాలి. ఆ డైలాగును పలువార్లు వినాలి. అప్పుడు ఆ కళాకారుని ఉచ్ఛారణ (Pronounciation) పసిగట్టవచ్చును. అలా కాని పక్షంలో ఆ కళాకారుడి కంఠ స్వరం పశు, పక్ష్యాదుల అరుపులకు గాని మరియు యాంత్రిక శబ్దాలకు గాని వేటికి దగ్గరగా వుంటే (relativity) వాటి గొంతుల ఆధారంగా సాధన చేస్తే తప్పక అతడి ప్రయత్నం ఫలిస్తుంది.

> మనస్సు చాలా పవిత్రమైనది. స్వర్గాన్ని నరకంగాను, నరకాన్ని స్వర్గంగాను అది మార్చగలదు.
>
> \- మిల్టన్

వీరిని అనుకరించడం వలన ఏదో కాస్త ఆనందం తప్ప ప్రయోజనమేమీ లేదని కొందరు భావించవచ్చు. కాని ప్రయోజనం ఉంది. వీరందరిని అనుకరించినపుడు కడుపుబ్బా నవ్వుకొని మానసిక ఉల్లాసాన్ని పొందుతారు. ఇదే విషయాన్ని ఇంతకు ముందు 'నవ్వడం వలన ప్రయోజనం' అనే పాఠంలో వివరించడం జరిగింది. అంతేకాక విజ్ఞాన పరమైన విషయాలను తెలుపుతూ, సామాజిక రుగ్మతలను ఎత్తి చూపడం వలన ప్రేక్షకులు గ్రహించి విజ్ఞానవంతులవుతారు.

ప్రతి మిమిక్రీ కళాకారునికి స్క్రిప్ట్ దొరకదు. అందుకని వారిని దృష్టిలో ఉంచుకొని ఇక్కడ 50 మంది ప్రముఖ సినీయాక్టర్ల డైలాగులను ఇవ్వడం జరిగింది.

## 50 మంది సినిమా కళాకారుల డైలాగ్‌లు :-

**గమనిక :** డైలాగును ఎక్కడ కట్ చేయాలో అక్కడ 'స్లాష్' ( / ) ఇవ్వడం జరిగింది.

**1) యన్.టి. రామారావు** ('బొబ్బిలి పులి' చిత్రం నుంచి) :

విజయా...? / ఆ మాట అనొద్దు / మహాత్మాగాంధీ ఒక్కడే / ఒక్కడు నడుం కడితే దేశం దేశమే ఆయన వెనకొచ్చింది / అల్లూరి సీతారామరాజు ఒక్కడే / మన్యం అతని వెంట నడిచొచ్చింది / భగత్ సింగ్ ఒక్కడే / యువశక్తి ఆయన వెన్నంటి నడిచింది / నడుం కట్టే మనుష్యులుంటే పిడికిలి బిగించే వాళ్ళుంటారు / ముందడుగు వేసే మనుష్యులుంటే ముందుకు దూకేవాళ్ళుంటారు.

> హాస్య రసాన్ని ఆస్వాదించలేనిచో నేను ఏనాడో ఆత్మహత్య చేసుకొని ఉండేవాడను.
>
> - గాంధీ

బొమ్మ శ్రీనివాస్

**2. అక్కినేని నాగేశ్వరరావు** ('ప్రేమాభిషేకం' చిత్రం నుండి) :

ఎవరు...? / ఎవరు రాక్షసుల్లాగా ప్రవర్తించారు? / ఎవరు మానవత్వం లేకుండా ప్రవర్తించారు? / నిన్నే ప్రేమించి, నీవే దేవతవని ఆరాధించి, నీ చుట్టూ తిరిగిన ప్రతిసారి నువ్వేం చేశావు / ఛీ... అన్నావు. ఛీ... కొట్టావు, అసహ్యించుకున్నావు, అసభ్యంగా మాట్లాడావు / ఈ లోకంలో నువ్వు తప్ప ఇంకెవ్వరూ లేరనుకున్నావు / అందుకే... హీ...హీ...హ్హా...హ్హా...హ్హా...

**3. సూపర్‌స్టార్ కృష్ణ :**

మనిషన్నాక ప్రేమించాలి ప్రేమించబడాలి / అంతేగాని అల్లరితో, గర్వంతో అందరిచేత ఇలా అసహ్యించబడొద్దు / వాళ్ళను చూసైనా నిన్ను నిన్నుగా ప్రేమించే మనిషిని... నీకోసం బాధపడే మనస్సుని సంపాదించుకో / అల్లరి, గర్వం మాని ప్రేమించటం నేర్చుకో / వస్తా.

**4. చిరంజీవి** ('ఖైదీ' చిత్రం నుండి) :

యస్.పి. గారు / ఇప్పుడు నా శరీరాన్ని తూట్లు పడేలా కాల్చుకోండి / ఇనుప సంకెళ్ళతో బంధించి, ఉరికంభం వరకు ఈడ్చుకెళ్లండి / భారత శిక్షాస్మృతిలో ఎన్ని శిక్షలున్నాయో... అన్నీ విధించుకోండి / కమాన్...

**5. శోభన్‌బాబు** ('ముగ్గురు మొనగాళ్ళు' చిత్రం నుండి) :

'ఏమండి / నేను నిన్ను ప్రేమిస్తున్నాను. మీరు నన్ను

మహత్తరమైన త్యాగాల వల్లనే మహత్తరమైన పనులు సాధింపబడతాయి.

– స్వామి వివేకానంద

ప్రేమిస్తున్నారు. మనిద్దరం ప్రేమించుకుంటున్నాం అంతే ' /

**6. బాలకృష్ణ** ('పెద్దన్నయ్య' చిత్రం నుండి) :

ఒరే... భాస్కర్రాయుడు ఎహే / తమ్ముడు తనవాడైనా / ధర్మం కోసం పోరాడే మనిషినిరా నేను / రమ్మనురా నీ తమ్ముడ్ని బయటికి. ఎహే/ తలకి తల / కాలుకి కాలు / ప్రాణానికి ప్రాణమురా! /

**7. సుధాకర్ :**

ఓరి చిన్నన్నో / ఓరి పెద్దన్నో / నీ అబ్బా / పిచ్చకొట్టుడు కొడుతున్నార్రా... బాబో / అయ్యో... / నీ అబ్బ.

**8. బాబూ మోహన్ :**

అన్నా / అందరూ / తెల్లగ గలీజుగున్నరన్న / నేనొక్కడినే నల్లగా/ దున్న పోతులా అందంగా ఉన్నా గదన్నా / మరి అదే / ఎందుకు / ఏమిటి / ఎలా? /

**9. వెంకటేష్** ('గణేష్' చిత్రం నుండి) :

పెన్నుతో చచ్చే బచ్చాగాడివి నీకెందుకురా బుల్లెట్లు / ముచ్చు మొహం చచ్చువెధవ / అసలు ఫైల్ ఎక్కడ ఉందా అని చవటలాగ చమటలు తుడుచుకుంటున్నావా / ఫైల్ నా దగ్గర ఉందిరా / ఆడపిల్ల దగ్గర చూపెట్టడం కాదురా నీ చచ్చు మొగతనం / నీకు దమ్ముంటే / ఒక అబ్బకు పుట్టిన వాడివే అయితే / రారా నా ఇంటికి / లేదా చెప్పు చౌరస్తాలో గిరిగీసి ఫైల్ అక్కడ పెడతాను / అరేయ్ / ఎనీ సెంటర్ /

> జ్యోతిష్యం పేకాట వంటిది.
>
> - డా॥ కొవ్వూర్

బొమ్మ శ్రీనివాస్
సింగిల్ హ్యాండ్... గణేశ్.

**10. నాగార్జున** ('గీతాంజలి' చిత్రం నుండి) :

లక్ష్మక్క ఆపండి / ఆపండి లక్ష్మక్క ఆపండి / ఇదిగో చూడండి / ఈ ఏడుపులు పెడబొబ్బలు వినలేకే ఇక్కడికొచ్చాను / ఇక్కడ కూడా అవే ఉంటే నేనుండలేను / అర్థం అయ్యిందా? / నాకు మాటివ్వండి / ఈ విషయం ఎక్కడా చెప్పనని మాటివ్వండి/ మాటా!

**11. కృష్ణంరాజు** ('బొబ్బిలి బ్రహ్మన్న' చిత్రం నుండి) :

రాయుడు... / సరాసరి మృగరాజు గృహంలోనికి ప్రవేశించి కాలు దువ్వుతున్నావు / నీ శవం కూడా తిరిగి వెళ్ళదని గుర్తుంచుకో...

**12. రావుగోపాలరావు** ('బొబ్బిలి బ్రహ్మన్న' చిత్రం నుండి) :

అదంతా ధర్మపీఠం మహాత్యంరా! / పవరుంటే పల్లేరుకాయ కూడ ప్రాణం తీద్దనీ / అసలు ఆ ధర్మ పీఠం మీద నేను కూర్చున్నా ప్రజలు అగ్గగలాడి పోతారు / వంశపారం పర్యంగా వస్తున్న హక్కువల్ల / ఆ బ్రహ్మన్న కుర్చుంటున్నాడే గాని / లేకపోతే ఆ ధర్మపీఠం మీద / ఈ మీసాల పెద వెంకట్రాయుడు ఎప్పుడో కూర్చోవలె గదరా...

**13. నాగభూషణం** ('రక్తకన్నీరు' నాటకం నుండి):

గోపాలం... గోపాలం... అంటూ ఒకటే మోతా / ఏ... పెళ్లేగా / చేసుకుంటాపో / చేసుకున్నోడెవడు బాగు పడ్డాడు కనుక.

> బలహీనులు అదృష్టాన్ని, బలవంతులు కృషిని నమ్ముకుంటారు.
>
> \- ఎమర్సన్

**14. నూతన్ ప్రసాద్** ('మాస్టర్' చిత్రం నుండి) :

మీరు కాలేజికి వచ్చింది చదువుకోవటానికా / లేక మాస్టర్స్‌తో తగవులాడ్డానికా / యాఁవ్...

**15. రాజేంద్ర ప్రసాద్** ('లేడీస్ టైలర్' చిత్రం నుండి) :

సుజాత / మై... మర్ జాత / తుమార చుట్టు పిర్‌జాత / అది.. నా తలరాత / మచ్చా / బహుత్ అచ్చా / మై బచ్చా / బట్టల సత్యం లుచ్చా.

**16. మల్లికార్జునరావు** (బట్టల సత్యం 'లేడీస్ టైలర్' చిత్రం నుండి) :

ఇదిగో సీతారాముడు / మీ గురుడికి బిందెడు బద్ధకం, చెంబెడు చాదస్తం లేకుంటే / దర్జీలకు రాజుగా ఉండి దర్జాగా ఉండాల్సినోడు గదా!

**17. రాజబాబు** :

ఆఁ... అయ్యో / మా ఆంటి ఇంట్లో ఏం కూరచేసిందో ఏంటో/ అయ్య బాబోయ్.

**18. కోట శ్రీనివాసరావు** ('ప్రతిఘటన' చిత్రం నుండి) :

గీయ్యాల మన మందరం గీడ ఎందుకూ గూకున్నం / ఆఁ / తాగదందుకు, తినదందుకు కాదు / మరి ఎందుకు? / ఎలక్షన్లత్తాయన్న ముచ్చట మీ అందరికెరుకే / మరి గీ ఎలక్షన్‌ల / గీ నియోజక వర్గంల/ ఎవ్వడు నిలబడాలె / గదీ... గదీ దేల్చేందుకు.

| |
|---|
| నీవు విజయం పొందటానికి అవసరమైన బలం, శక్తి నీలోనే ఉన్నాయి. అందుచేత నీ భవిష్యత్తును నీవే తీర్చిదిద్దుకో<br>- వివేకానంద |

**19. బ్రహ్మానందం :**

దించుతావురా... / దించుతావ్‌రా నువ్వు ... ఆ! నన్ను దించుతావ్‌రా! / ఐరన్‌లెగ్ / దరిద్రుడా / చండాలుడా/ నీచుడా / ఆ మొహం చూడు / చంపేస్తాన్రా నిన్ను / చంపేస్తాను / చంపెస్తా... / చంపెస్తా.

**20. రాళ్లపల్లి** ('ప్రతిఘటన' చిత్రం నుండి) :

సోదర సోదరీమణులారా! / గొడ్డలి పార్టీ యువజన నాయకుడు / శ్రీ కాళీ గారి సభలో ఉన్న పాయింట్ వెనకాల పాయింట్ ఏమిటని ఆలోచిస్తే తేలిన పాయింట్ ఏమిటంటే / వారు ఈ దేశానికే ఒక కొత్త పాయింట్ / రాజకీయాల్లో టర్నింగ్ పాయింట్ / శ్రీ కాళీ గారు / పుట్టగానే ఏడ్చారా? / లేదు / నవ్వారా? / లేదు / నర్సు మెడలోని గొలుసు లాగారు.

**21. ప్రభాకర్‌రెడ్డి** ('ప్రేమాభిషేకం' చిత్రం నుండి) :

ఏమిటో నమ్మా... / ఏ పిల్లతో చూసిన వాడేనట / ఏ బార్‌లో చూసిన వాడే నట / వాడు తాగి చెడిపోతున్నందుకు కాదమ్మా!

**22. జగ్గయ్య** ('బొబ్బిలిపులి' చిత్రం నుండి) :

నేరస్థున్ని పట్టుకోడానికి ఒక్కడు చాలు / ఒకవేళ నువ్వు చేసిందే న్యాయం అయితే / నీకు శిక్షతగ్గేలా నేను చూస్తాను.

> మానవుని కష్టాలన్నింటికి కారణం అతని అజ్ఞానం, క్రమశిక్షణా రాహిత్యం.
>
> - కౌటిల్యుడు

**23. సుత్తివేలు :**

అయ్యా... / మరేమోనండయ్యా / ఆ పొద్దు మీరు స్టేజి మీదండయ్యా / పైకు అనుకొని, అవమానం చేయుపట్టు కున్నారండయ్యా / జనం ఇరగదన్నారుకదండయ్యా / మీరు మరిచిపోయి వుంటారయ్యా.

**24. సి.యస్.ఆర్.** ('మాయాబజార్' చిత్రం నుండి) :

ఏమయ్యా శాస్త్రులు / నేను వియ్యాల వారిని అల్లరి పెట్టమంటే మీరు నన్నల్లరి పెడతారా! / ఇకనైనా బుద్ధిగా ఉండండి / లేకపోతే/ మీకు గుండు గీయించి తైలమర్ధనం చేయిస్తాను. / ఇటువంటి వీరుడు/ కనబడ్డ ప్రతి పిల్లను చూడాల్సిందే / హరిహర రాజులు అడ్డమొచ్చినా ఆ పిల్లను పెళ్లాడవల్సిందే.

**25. తనికెళ్ల భరణి** ('యమలీల' చిత్రం నుండి) :

తోటరాముడు ఎవ్వడని అడుగుతావ్ బే! / దేకో / దేకో / గస్సల్ నీకు నరకం అంటే తెలుసా / నరకం / గీడ నేనే యముడ్ని / ఆరె... తూ.

**26. రాజశేఖర్** ('అంకుశం' చిత్రం నుండి) :

మిస్టర్ విశ్వనాథ్ from వికాస్ / ఉపన్యాసం ఇవ్వడమే మీ పత్రికాశయమా / ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడు / ఏమనుకుంటు న్నావురా పోలీసంటే? / వ్రాయటానికి పెన్ను, ప్రింటు చేయడానికి

knowledge is power.

- ఆంగ్ల సామెత

బొమ్మ శ్రీనివాస్
పేపర్లున్నాయని ఇష్టం వచ్చినట్లు వాగితే / కొట్టడానికి లాఠీ, తోయడానికి జైళ్లున్నాయ్. **Mind it and get out. /**

**27. సాయికుమార్** ('పోలీస్ స్టోరీ' చిత్రం నుండి) :

జనం ప్రాణాలు పోయినా సరే, మీ లాంటి మినిస్టర్లకి దారివ్వాలని ఏ చట్టంలోనూ లేదు. / **Aftral you are a minister.**

**28. సోమయాజులు** ('శంకరాభరణం' చిత్రం నుండి) :

గాత్రాన్ని నీ ఇష్టం వచ్చినట్లూ పాడుతూ / సంగీతాన్ని అపవిత్రం చేస్తున్నావు దాసు.

**29. గొల్లపూడి :**

ఏమయ్యా పంతులు / ఆ / అసలు... ఆడదంటే ఎవరయ్యా / అర్ధరాత్రి పూట / భర్త అలసిపోయి ఇంటికి వస్తే / అనందంతో, ప్రేమతో అన్నం పెట్టేదయ్యా / అదేరా పిచ్చికన్నా.

**30. ఏ.వీ.యస్.** ('శుభలగ్నం' చిత్రం నుండి) :

ఏమండీ బావున్నారా? / మీ ఆవిడ బాగుందా? / మీ పిల్లలు బాగున్నారా ? / మీ ఇంట్లో మంచం ఉందా? / మంచంలో నల్లి ఉందా? / గోడ మీద బల్లి ఉందా? / అది ఆడదా? మగదా? / మీకు చెట్లు కనబడుతాయా? / మెట్లు కనబడుతాయా? / గాలి కనబడుతుందా?

ప్రదర్శన ముగియగానే ప్రేక్షకులు వెళ్ళిపోయినట్లుగా ధనం ఎంతయినా చివరకు నశించిపోయేదే.

- తిరుక్కురళ్

**31. కమల్ హాసన్** ('ఆకలి రాజ్యం' చిత్రం నుండి) :

చూడు బ్రదర్... / ఇది ఆకలి రాజ్యం / ఈ రాజ్యంలో నీది నాది అనే బేధం ఉండదు / అన్నీ మనవే / ప్యాంట్, షర్టు నుండి / బీడీ, సిగరెట్ వరకు / చడ్డి నుండి బెడ్డింగ్ వరకు / ఎవరిపైనా / ఎవ్వరైనా వాడుకోవచ్చు / ఇక్కడ స్వంతం అని చెప్పుకోవలసింది / పేరు ఒక్కటే.

**32. రజనీకాంత్** ('పెదరాయుడు' చిత్రం నుండి) :

ఆపు... / నువ్వు చేతులు కట్టుకొని, కన్నీరు పెట్టుకున్నందువల్ల ప్రయోజనం ఉండదు ఈ పాపారాయుడి తీర్పులో మార్పుండదు / మీరిద్దరు ఒకే కడుపులో పుట్టినంత మాత్రాన / వీడు చేసిన తప్పు వాడి మంచి తనం వల్ల ఒప్పయిపోదు / ఎవడి తప్పు వాడిదే / ఎవడి ఒప్పు వాడిదే / న్యాయానికి తెలిసిన బంధం బంధుత్వం ఒక్కటే / తప్పు చేసిన వాడు దానికి శత్రువు / ఒప్పు చేసిన వాడు దానికి బంధువు.

**33. రాంరెడ్డి** ('అంకుశం' చిత్రం నుండి) :

ఏంది / అది మనకు వ్యతిరేకంగా సాక్షం చెబుతుందా! అరె చంటి / ఈ రోజే దాని గూడెంలో స్పాట్ పెట్టాలా / పొద్దటి కల్లా దాని మానం పోవాలా మధ్యాహ్నం మన మాటినాల / లేదా / సాయంత్రం దాన్ని సంపాలా / పొల్టికలుగా నేను చూస్కుంట గాని/ స్పాట్ మాత్రం / టైమ్ ప్రకారం జరిగిపోవాలా.

జీవితంలో అన్నింటి కన్నా ముఖ్యం – ఒక లక్ష్యం కలిగివుండటం.
– గోథె

**34. రఘువరన్** ('శివ' చిత్రం నుండి) :

నానాజీ / ఈ జె.డి. ఏంటి / ప్రతిదానికి మనల్ని హెల్ప్ అడుగుతాడు / ఈ స్టూడెంట్స్ / మనకు హెల్ప్ అవ్వాలి కాని / మన మీద వాళ్ళు బ్రతక్కూడదు / మీరు చెప్పిందాన్ని బట్టి ఆలోచిస్తే / ఈ 'శివ'ను / అంత తేలిగ్గా కొట్టి పడేసేవాడు లేడు / సరిగ్గా వాడుకుంటే/ మనకు పనికి రావొచ్చు / నువ్వెళ్ళు / ఎలక్షన్‌లో నిలబడమని చెప్పు / కాని... / మన తరుపున.

**35. దేవరాజ్** ('మాస్టర్' చిత్రం నుండి) :

నేను... / డి.ఆర్. (దేవరాజ్) ని మాట్లాడుతున్నాను / ఈ రోజు ఒక మెడికల్ ఫ్యాక్టరీని / అదే / నవనిర్మాణ నగరంలో ఉన్నదానిని/ స్మాష్ చేయాలి.

**36. రేలంగి :**

అదేంటయ్యా బాబూ... / సక్కగ చలికాలం / ఆ దుప్పటి కప్పుకొని పడుకో / ఎదవ / హ్హి... హ్హి... హ్హి...

**37. అల్లు రామలింగయ్య :**

ఏమిటోనమ్మా... / నీపెళ్లికి పాతికవేలు / శోభనానికి 10 వేలు కావాలి / అంత డబ్బు / నేను ఎలా తేవాలో తెలియక బాధ పడుతున్నానమ్మా / కుయ్... కుయ్... కుయ్...

> సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా చేస్తుంది. వారు ఇంతకు పూర్వం కన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది.
>
> - ఇల్యా ఎహ్రెన్ బర్గ్

**38. ఆలి** ('హలో బ్రదర్' చిత్రం నుండి) :-

హలో... / ఎక్సుజుమి బాబు... / మేజర్ చంద్రకాంత్ ఉన్నాడా బాబు... / హలో... మేజర్ చంద్రకాంతేనా మాట్లాడేది / హలో బాబు... / **May I help you?**

**39. ప్రకాశ్‌రాజ్** ('సుస్వాగతం' చిత్రం నుండి) :

వాడు నిన్ను ప్రేమించాడని కొట్టానా! / నేను కొట్టావని వాడ్ని నువ్వు ప్రేమించావా! / మరి, వాడితో **ice-cream parlor** కెందుకెళ్ళావు తల్లీ / ప్రేమించలేదని ప్రేమతో చెప్పటానికా!

**40. దాసరి నారాయణరావు** ('M.L.A. ఏడుకొండలు' చిత్రం నుండి) :

మన రాష్ట్రంలో / ఆc / నా మంత్రి వర్గంలో / ఒక ముఖ్యమంత్రి... మిగతా అందరూ ఉపముఖ్యమంత్రులండి... / చాలా వింతగాలేదండి / సోషలిజం అండి / ఆc / ఇప్పుడు... / వెంకట్రామయ్య ఉన్నారు గదండి / వారు ఎలా నెగ్గారో అప్పారావు అలాగే నెగ్గారండి / అప్పారావు ఎలా నెగ్గారో సుబ్బారావు అలాగే నెగ్గారండి / సుబ్బారావు ఎలా నెగ్గారో వెంకటపాపయ్య అలాగే నెగ్గారు కదండి / ఆయ్... / మరి అందరు / అదే జనంతో ఓట్లు ఏయించుకున్నారు / అదే లైన్‌లో నిలబడి ఓట్లు ఏయించుకున్నారు / అదే డబ్బాలో ఓట్లు ఏయించుకున్నారు.

> పురుషుడి బలహీనత ఎక్కడ వున్నదో స్త్రీ బాగా గ్రహించ గలుగుతుంది. కాని అతని గొప్ప తనం ఎక్కడ వున్నదో మాత్రం గ్రహించలేదు.
>
> - రవీంద్రనాథ్ ఠాగూర్

**41. గుమ్మడి :**

నాయనా... / ఆ కుక్క పిల్లకు అరవడమే కాని కరవడం తెలియదు నాయనా! / ఆ కుక్క పిల్ల ఇంతకాలనికి నిన్ను కరచిందంటే / నా మనస్సు ఎంతో సంతోషంగా వుంది నాయనా!.

**42. మురళీమోహన్ :**

సార్... / కుంటి చెల్లెల్ని, గుడ్డి తమ్ముణ్ణి పోషించుకోలేక బాధపడి పోతున్నాను సార్ / ఏదైనా ఉద్యోగం ఉంటే ఇచ్చి పుణ్యం కట్టుకోండి సార్ / ప్లీజ్ సార్ నీ కాళ్ళు పట్టుకుంటాను సార్.

**43. కాంతారావు :**

ఆ... చిలిపి కన్నుల చిన్నారి వయస్సు / నాకు అర్థం కావటం లేదు వసంతకా / పేరడిగితే పద్మాన్ని చూపించింది / అంటే పద్మావతి దేవి అన్నమాట / ఊరడిగితే ఐదువేళ్ళు చూపించి మధ్యలో సున్న పెట్టింది / అంటే పాంచాలికమన్నమాట.

**44. మూదాల రంగారావు :**

వరె అయ్యా! / వద్దురా అయ్యా! / వాణ్ణి కూడ నాలాగా పాలేరును చెయ్యొద్దురా అయ్యా / అసలుకు నువ్వు, వడ్డీకి నేను ఎలాగో బలయ్యాంరా అయ్యా / వాణ్ణి కూడ ఇలాగే బలిచేయకురా అయ్యా!

**45. కళ్ళు చిదంబరం :**

ఏమండి... / ఒక 'టీ' తాగుతే రెండు ఫ్రీ / రెండు 'టీ'లు తాగుతే నాలుగు ఫ్రీ... / ఆ... / మరదే.

> అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు వినయంగా వుండడం మంచిది కాదు. కాని అందరూ నిన్ను ప్రశంసిస్తున్నప్పుడు వినయంగా వుండటం మాత్రం చాలా అరుదైన విషయం.
>
> - సెయింట్ బెర్నార్డ్

**46. అంబరీశిస్వరి** ('జగదేక వీరుడు అతిలోక సుందరి' చిత్రం నుండి) :

నా చరణం / నీకు చరణం / కుట్ర, కుతంత్రం / మోసం, దగా / వంచన, ద్రోహం / మాకు / వెన్నతో పెట్టిన విద్య / ఇప్పుడు నువ్వు / రెక్కలు తెగిన పక్షివి.

**47. యస్.వి. రంగారావు :**

హా... బెదిరిస్తున్నావా మీనాక్షి / ఈ సింహబలుడంటే ఎవరను కున్నావ్ / వైరివీర కుంజర యూధంబులకు సింహ స్వప్నం / నారీజన మంజుల హృదయాలకు మధుర స్వప్నం / వీడు పట్టిన పట్టు వీడడు, నిను చేపట్టక మానడు / ఆఁ హొమ్ము మాలిని.

**48. మాడా:**

మాయదారి గోలండి, మాయదారి గోల / చూసేది ఎక్కువ, చేసేది తక్కువని / ఇందాక నుండి మాబావయ్యకు ఒక్కటే కంగారు/ ఇదిగో బావయ్యో.

**49. భానుమతి :**

ఏం వదినా... బాగున్నారా ... / హు... / హ్హ హ్హ హ్హ / పాట:- అమ్మాయిలు... అబ్బాయిలు. నామాటలో నిజం / వింటారా మీరు / అమ్మాయిలు... అబ్బాయిలు.

**50. యం. యస్. నారాయణ** ('చాలా బాగుంది' చిత్రం నుండి) :

రావచ్చు / చాలా దూరం నడుస్తే / కీళ్ల నొప్పులు రావొచ్చు,

ధైర్యసాహసాలు, ప్రతిభ ఇవి ప్రతి మానవుడి విజయ సాధనకు సోపానాలు.

– గోథె

**బొమ్మ శ్రీనివాస్**
వెూకాళ్ల నొప్పులు రావొచ్చు / మీ అల్లుని ఇల్లేంటి / అల్లు రామలింగయ్య అల్లుడు చిరంజీవి ఇల్లు రావొచ్చు / యన్.టి.ఆర్. అల్లుడు నారా చంద్రబాబు ఇల్లు రావొచ్చు.

## కొందరు రేడియో ఆర్టిస్టుల గొంతులు

**1) 'చింతామణి' నాటకములో సుబ్బిశెట్టి - చింతామణి డైలాగులు...**

సుబ్బిశెట్టి :- ఏంటి చింతా బాగున్నావా?
చింతామణి :- ఊ! ఎప్పుడు బాగున్నావా? బాగున్నారా? అనడమే గాని ఎప్పుడైనా ఏమైనా తెచ్చారా ఏంటి?
సుబ్బిశెట్టి :- ఈ రోజు నీ కోసం ఏం తెచ్చానో చూడు!
చింతామణి :- ఏమిటుండది?
సుబ్బిశెట్టి :- ఇదిగో చూడు...
చింతామణి :- అబ్బా... ఈ బోడి ఉంగరం కోసం పెద్ద బడాయి
సుబ్బిశెట్టి :- ఉంగరం అంటూ అంత తేలిగ్గా తీసేశావు ఎక్కడ పెట్టమంటావు?
చింతామణి :- మధ్య వ్రేలుకు ... అబ్బా ... అబ్బా... అబ్బా బ్బా బ్బా బ్బా ...
సుబ్బిశెట్టి :- ఏంటే పెట్టీపెట్టక ముందే అలా అరుస్తావు. పెట్టేదుంటే ఇంకా ఎలా అరుస్తావో?

సైనికుడు కాలేనివాడు గూఢాచారి అయినట్లు,
కళాకారుడు కాలేనివాడు విమర్శకుడవుతాడు.
- గుస్తవ్ ఫ్లాబేర్

**2. డి. వెంకట్రామయ్య (న్యూస్‌రీడర్) :**

ఆకాశవాణి వార్తలు చదువుతుంది డి. వెంకట్రామయ్య. ఇటీవల జరిగిన ఒక స్కూల్ ప్రోగ్రామ్‌లో భారత్ ప్రధాని శ్రీ అటల్ బిహారి వాజ్‌పేయ్ మాట్లాడుతూ పిల్లల చదువుల విషయంలో తల్లిదండ్రులు శ్రద్ధ వహించాలని అన్నారు. ఇది ఇలా ఉండగ, వరంగల్ రైల్వే సేష్టన్‌లో నేడు ఒక రైలు బండి పట్టాలు లేకుండ ప్రయాణించింది.

**3. కీ॥శే॥ అద్దంకి మన్నార్ (న్యూస్‌రీడర్) :**

ఆకాశవాణి వార్తలు చదువుతుంది అద్దంకి మన్నార్. వరంగల్ జెమిని టాకీస్ దగ్గర ఇద్దరు ఆడవాళ్లను రెండు గద్దలెత్తుకు పోయాయ్. విషయం తెలిసిన కానిస్టేబుల్ పైకిపోయి వైకుంఠం చేరుకున్నాడు. ఈ వార్తలు ఇంతటితో సమాప్తం.

**4. పాడి పంటల కార్యక్రమం :**

అయ్యా గురువు గారు మన వరంగల్ బొల్లికుంట గ్రామం నుండి మల్లయ్య అడుగుచున్నారు. వారి కొబ్బరి చెట్టుకు పురుగు పట్టిందట. పురుగును నివారించాలంటే మరి ఏం చెయ్యాలని వారు అడుగుచున్నారు.

మరి చూడు పెదబాబు... ఈ కొబ్బరి చెట్టుకు పురుగు పట్టినపుడు ముందు మనం చెట్లను పీకెయ్యాలి. చెట్లను పీకి ఇంర్డినులో ముంచినట్లయితే చెట్లు చచ్చిపోతాయి. చెట్టుతో పాటు పురుగు కూడ చచ్చిపోతుంది. ఈ విధంగా మనం పురుగును నివారించ వచ్చున్నమాట.

ఇంతకు ముందే కొందరి రేడియో ఆర్టిస్టుల డైలాగులు ఇవ్వడం జరిగింది గమనించగలరు.

> పగలబడి నవ్వటం నిష్కల్మషమైన మనస్సును సూచిస్తుంది.
>
> - గోల్డ్‌స్మిత్

## గాయనీ, గాయకులను అనుకరించడం

1) **ఘంటశాల వెంకటేశ్వరరావు** ('మూగ మనసులు' చిత్రం నుండి):
పాడుతా తీయగా చల్లగ
పసిపాపల నిదురపో తల్లిగ ... బంగారు తల్లిగా... ।పాడుతా।

2) **ఆర్. రాణి** ('దేవదాసు' చిత్రం నుండి) :
అంతా భ్రాంతియేనా... జీవితానా వెలుగింతేనా
ఆశా నిరాశేనా... మిగిలేది చింతేనా ॥2॥

3) **యస్.పి. బాలసుబ్రహ్మణ్యం** ('గీతాంజలి' చిత్రం నుండి) :
ఓ ప్రియా... ప్రియా, నా... ప్రియా... ప్రియా
నీదో లోకం, నాదో లోకం, నింగీనేల తాకేదెలాగ ।ఓప్రియా।

4) **పి.బి. శ్రీనివాస్** ('ప్రేమించి చూడు' చిత్రం నుండి) :
వెన్నెల రేయి, ఎంతో చలి చలి
వెచ్చనిదానా, రావే నా చెలి ॥2॥

5) **ఎ.యం. రాజా** ('మిస్సమ్మ' చిత్రం నుండి) :
బృందావనమది అందరిది
గోవిందుడు అందరి వాడేలే
ఎందుకె రాధా ఈ సునసూయలు
అందములందరి ఆనందములె! ॥2॥

> సాహిత్యం ప్రజలను జ్ఞానవంతులుగా చేస్తుంది. వారు ఇంతకు పూర్వం కన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది.
>
> \- ఇల్యా ఎహ్రెన్ బర్గ్

**6) ఏసుదాస్** ('బ్రహ్మ' చిత్రం నుండి) :
ముసిముసి నవ్వులలోన, కురిసెను పువ్వుల వాన
ఏనోము నోసిన, ఏ పూజ చేసిన
పిలిచి పలికే వాడే - బ్రహ్మ ఒక్కడే... పరబ్రహ్మ ఒక్కడే ॥2॥

**7) భానుమతి :**
అమ్మాయిలు అబ్బాయిలు నామాటలో నిజం
వింటారా మీరు
అమ్మాయిలు, అబ్బాయిలు ...

**8) వి. రామకృష్ణ** ('శారద' చిత్రం నుండి) :
శారద... నను చేరదా
ఏమిటమ్మా సిగ్గా, నీ సిగ్గే లేత బుగ్గా॥
ఓ శారదా నీరద నారదా...

**9) మహ్మద్ రఫి** ('భలే తమ్ముడు' చిత్రం నుండి) :
ఎంతవారు గాని, వేదాంతులైన గాని
వాలు చూపు సోకగానె తెలిపోదురోయ్
కైపులో ... కైపులో ... కైపులో ...

**10) రాజ్ సీతారామ్** ('సింహాసనం' చిత్రం నుండి) :
ఇది ఎక్కడి సుందరరూపం
ఇది ఏదో మన్మద బాణం
తొలి చూపుల వలలో పడితే... ఏ

> నీ గురించి నువ్వు ఉన్నతంగా ఊహించుకోవడం లేదా తక్కువగా అంచనా వేసుకోవడం రెండూ తప్పే.
>
> \- గోథె

బొమ్మ శ్రీనివాస్

చెలరేగెను వలపుల తాపం.

వహవా... వహవా...

అరె! వహవా నీ యవ్వనం, వహవా నీ జవ్వనం

బంగారంలో సింగారాలే, కలిపాడు ఆదేవుడు

ధిమ్ తానా ధిమ్ తానా వహవా

ధిమ్ తానా ధిమ్ తానా

**11. జి. ఆనంద్** ('అమెరికా అమ్మాయి' చిత్రం నుండి) :

ఒక వేణువు, వినిపించెను, అనురాగ గీతిక

ఒక రాధిక, పంపించెను, నవరాగ మాలికా ।ఒక వేణువు।

**12. మాధవపెద్ది సత్యం** ('మాయాబజార్' చిత్రం నుండి) :

వివాహ భోజనంబు, వింతైన వంటకంబు

వియ్యాల వారి విందు, ఒహ్హో హ్హో నాకె ముందు...

అహ్హ హ్హ హ్హ హ్హహ్హ... ఒహ్హో హ్హో హ్హో హ్హో హ్హో

**13. పాణిగ్రాహి** :

చల్లని రాజా ఓ చందమామా

నీ కథలన్ని తెలిసాయి ఓ చందమామా, నా చందమామా

**14. మనో** ('కిల్లర్' చిత్రం నుండి) :

ప్రియా ప్రియతమా రాగాలు, సఖీ కుశలమా అందాలు

నీ లయ పంచుకుంటుంటే, నా శృతి మించిపోతుంటే

నా... లో... రే...గే ॥ప్రియా॥

చక్కగా మాట్లాడదలుచుకున్నవారు ముందు చక్కగా వినడం నేర్చుకోవాలి.

- ఆర్. ఫోకాల్డ్

ఈ విధంగా ఆయా గాయకులు పాడిన పాటలను అనుకరించవచ్చును. ఒకే పాటను వివిధ గాయకులు తమదైన బాణీలో ఎలా పాడగలరో అనుకరించి వినిపించవచ్చును.

అంతేకాదు ఒక పాటను తీసుకొని వివిధ కాలాల్లో (1964, 1984, 2004 సంవత్సరాలలో) ఎలా రూపాంతరం చెందగలదో ఊహించి చెప్పినప్పుడు ప్రేక్షకులు ఆనందపరవశులవుతారు.

ఇక మిమిక్రీలో 4వ భాగమైన రాజకీయ నాయకులను అనుకరించడం గురించి చర్చిద్దాం.



లోకంలో నిన్ను భూషిస్తున్నారా, దూషిస్తున్నారా అనేది ముఖ్యం కాదు. నిన్ను గురించి చర్చిస్తున్నారా లేదా అనేది ముఖ్యం.

– చర్చిల్

# IV



# రాజకీయ నాయకులను అనుకరించడం

మిమిక్రీలో రాజకీయ నాయకులను అనుకరించడం 4వ భాగము. ప్రజల్లో బాగా కీర్తి, ప్రతిష్ఠలు గల రాజకీయ నాయకులను, వివాదాస్పదమైన రాజకీయ నాయకుల కంఠాలను వారి బాణీలోనే ఉచ్ఛారణ (pronounciation) తో హావ, భావాలను కళ్ళకు కట్టినట్టు ప్రదర్శించి విన్పించినపుడు ప్రేక్షకులు పరమానందము పొందుతారు. ముఖ్యంగా ప్రస్తుత రాష్ట్రపతి, ప్రధానమంత్రి, గవర్నర్, ముఖ్యమంత్రి మొదలగువారి గొంతులను తప్పక నేర్చుకొని వుండాలి. కొందరు రాజకీయ నాయకుల ఉపన్యాసాలను ఇక్కడ పొందుపరచడం జరిగింది.

**1. జవహర్ లాల్ నెహ్రూ :**

**It is a tryst with destiny. While the rest of the world sleeps India wakes up to become independant.**

> చిత్రకారుడు, శిల్పి, నటుడు – ఈ ముగ్గురు కూడా జీవితాంతం పాఠాలు నేర్చుకుంటూ వుండాలి.
>
> – గాంధీ

**2. సుభాష్ చంద్రబోస్ :**

My Country men / You know / that I am always an optimist / Never the less / I say that the response by you has exceeded my fond expectation / Only when the blood of / Freedom loving Indians / will begin to flow / Then on will India attain her freedom. / Jai Hind.

**3. రాజీవ్ గాంధీ :**

దునియాకీ / సబ్ శక్తి యోంనే కోషిష్‌కీహైకి భారత్ టూట్ జాయే/ గాంధీ జీనె, పండిత్ జీనె, ఔర్ ఇందిరాజీనె జో రాస్తాదిఖాయీ/ వహీ హమ్‌నే దునియాం కో దిఖాయా / హమ్ ఇతినే కమ్‌జోర్ నహీహైంకె / హమారా దేశ్ ఏక్ హత్యారేకి గోలీసే టూట్ సకే! / జైహింద్.

**4. యన్.టి. రామారావు :** (బొంగురు పోయిన గొంతుతో)

పరిపాలనా వ్యవస్థ / దోపిడీ విధానంగా మారకుండ / సుపరిచితమైన / స్వచ్ఛమైన / పరిపాలనా విధానాన్ని అందించటమే/ తెలుగుదేశ లక్ష్యం / జై తెలుగు నాడు / జైజై తెలుగునాడు.

**5. కోట్ల విజయభాస్కర్ రెడ్డి :**

వ్యక్తి వికాసానికి / సమాజాభివృద్ధికి / దేశ ప్రగతికి / అక్షరాస్యత అనేది చాలా ముఖ్యం / సాంఘీక అసమానతను తొలగించి/ అట్టడుగు వర్గాలను సమర్థవంతంగా ఉంచటానికి / జాతీయ అక్షరాస్యతా

మధురమైన గానం శత్రువుని కూడ ఆకర్షించగలుగుతుంది.

- కాంగ్రీన్

ఉద్యమమును / ఎంతో శక్తివంతమైన సాధనంగా ప్రపంచమంతా గుర్తించారు.

**6. కీ॥శే॥ మర్రి చెన్నారెడ్డి :**

నిరక్షరాస్యత నిర్మూలన కోసం / మనం ఎంతో తీవ్రంగా కృషి చేయాలి / ఈ బాధ్యత మన అందరిపై ఉంది / ముఖ్యంగా యువత భుజస్కందాలపై / ఈ భారం ఉందని నేను మనవి చేస్తున్నాను.

**7. వాజ్‌పేయి :**

కార్గిల్‌కే వీర్ సిపాయి యోంకో / మై సర్ ఝుకాకర్ / ప్రణామ్ కర్‌తాహూం ...

**8. మహాత్మాగాంధీ :**

ఇస్ దేశ్ కి ఆజాది / సిర్ఫ్ ఏక్ జాతీ... యా / ఏక్ మజ్‌హబ్‌కే/ ఖుర్బానియోంసే నహీం ఆయీ.

ఈ విధంగా గొప్ప వ్యక్తుల యొక్క గొంతులను కూడా అనుకరించి నవతరానికి విన్పించడము వలన నిజంగా ఇలా మాట్లాడారా అనే భ్రాంతి కల్పించవచ్చును. లాల్‌బహదూర్ శాస్త్రి, పి. వి. నర్సింహారావు, నారా చంద్రబాబునాయుడు మొదలగు వారి ఉపన్యాసాలను ఇంతకు ముందే ఆయా సందర్భాలను బట్టి ఇవ్వడము జరిగింది.

ఎక్కువగా స్కూల్ పిల్లలకు ఆయా సందర్భాలలో గాంధీ, సుభాష్ చంద్రబోస్, లాల్‌బహదూర్ శాస్త్రి, నెహ్రూ, ఇందిరాగాంధీ,

> కళ, విజ్ఞాన శాస్త్రం సకల మానవాళి సంపదలు.
>
> – గోథె

రాజీవ్‌గాంధీ లాంటి దేశ నాయకుల ఉపన్యాసాలను విన్పించడం వలన వారికి ఒక విధమైన మంచి అవగాహన వస్తుంది. పిల్లలు కూడ విన్న ఆ విషయం జీవితాంతం గుర్తుంచుకొనే అవకాశం ఉంది. ఊరికే ఇలా మాట్లాడారు అనేకంటే గొంతుమార్చి చెప్పడం వలన పిల్లలు మరచి పోకుండా జీవితాంతం జ్ఞాపకం ఉంచుకుంటారు.

మిమిక్రీలో **5**వ భాగం అయిన కవులను, పండితులను, విమర్శకులను, రచయితలను అనుకరించడం ఎలాగో చూద్దాం.



కాకతీయ యూనివర్సిటీ వైస్‌ఛాన్స్‌లర్ శ్రీమతి విద్యావతిగారు మెమోంటోతో సత్కరిస్తున్న చిత్రం...

వంద కళల్లో ప్రవేశం సంపాదించటం కంటే ఒక్క కళలో పరిపక్వత సాధించగలగడమే మంచిది.

\- జపాన్ సూక్తి

V



# కవులు, పండితులు, విమర్శకులు మరియు రచయితలను అనుకరించడం

కవులు, పండితులు, విమర్శకులు మరియు రచయితలను అనుకరించడం మిమిక్రీలో 5వ భాగం. అయితే వీరిని సాధారణ సభలో కంటే అఫీషియల్ ప్రోగ్రామ్స్‌లో అనుకరించినపుడు ఎక్కువ రెస్పాన్స్ వస్తుంది. వీరిని అనుకరించడం అంటే మిమిక్రీ కళాకారునికి ఒక పరీక్షలాంటిది. ఎందుకంటే సినీనటులను, సినిమాలు చూసి పరిశీలించేంత సమయం, సందర్భం వీరిని పరిశీలించటానికి దొరకదు. అందుకే దొరికినటువంటి ఆ సమయ సందర్భాలలోనే వారి మ్యానరిజమ్స్, వాయిస్ క్యాచ్ చేయాలంటే కళాకారునికి కత్తిమీద సాము చేయడం లాంటిదే. కొందరు ముఖ్యమైన వ్యక్తులు మాట్లాడిన మాటలను ఇక్కడ పొందుపరచటం జరిగింది.

> ప్రజలను ఏడ్చేటట్లు చేయాలంటే ముందు నీ అంతట నీవు ఏడవాలి.
> వారిని నవ్వేలా చేయలాంటే నీ వరకు నీవు గంభీరంగా వుండాలి.
>
> – కాసనోవా

**1. డా॥ సి. నారాయణరెడ్డి** (యన్.టి. రామారావు చనిపోయినపుడు) :

చూస్తూ చూస్తూ ఉండగానే ఓ మహోన్నత నటశిఖరం నేలరాలి నట్లనిపించింది నాకు / చలనచిత్ర పరిశ్రమలో / నందమూరి నటసింహ ద్వారం నుండే నా చలన చిత్ర రంగ ప్రవేశం జరిగిందని సగర్వంగా చెప్పుకుంటాను నేను.

**2. లక్ష్మీపార్వతి :**

నేను ఏమన్నాను / అందరు నన్నే అన్నారు / నన్నే అంటున్నారు.

**3. కాళోజి నారాయణ రావు :**

ప్రజాస్వామ్య వ్యవస్థలో / అందరు ఒక్కరి కోసం / ఒక్కడు అందరి కోసం / పాటుపడాలి / అలాగే ఒకరి ఆలోచన కంటే / ఇద్దరి ఆలోచన ఎప్పుడు శ్రేయస్కరంగా ఉంటుంది.

**4. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయర్ స్వామి :**

నేనండి లావుగా వున్నా / నేను సన్నగా వున్నా / నేను చాలా చిక్కిపోయా / నేనెంత పొడుగో / అయ్యో... నేనెంత పొట్టోనేనూ/ నువ్వా పొట్టి / నువ్వా లావు / నువ్వా పొడుగు / నువ్వా చిక్కుతా / నువ్వా బలుస్తా / కాదు / నీ శరీరం బలిసింది, తరిగింది, పెరిగింది / ఇన్నీ శరీరానికి కలిగాయి / నీకేం కలుగలే! / కనుక... / నేను ఎప్పుడూ 'నేను' గానే ఉంటుంది.

మిమిక్రీలో 6వ భాగం అయిన నిత్యజీవితంలో మాండలికము (యాస) ను అనుకరించడము గురించి చర్చిద్దాము!

---

వెయ్యి మూల్గుల కంటే ఒక నవ్వు విలువైనది.

- లాంబ్

# VI



# నిత్యజీవితంలో మాండలికమును అనుకరించడం

నిత్య జీవితంలో మాండలికము (యాస) ను అనుకరించడమనేది మిమిక్రీ సిలబస్‌లో 6వ భాగం. అందరూ అన్ని పాత్రలు వేయలేరు. అలాగే అందరూ తెలుగు, హిందీ, ఇంగ్లీషు ఇంకా మొదలగు భాషలు వచ్చిన వాళ్లు ఒకే ఉచ్చారణ (Pronounciation) తో మాట్లాడలేరు. ఆయా ప్రాంతాలను బట్టి మాట్లాడే విధానంలో మార్పు ఉంటుంది. దీనిని ఆధారంగా చేసికొని అనేక రకాల సన్నివేశాలను తయారు చేసుకొనవచ్చును.

**ఉదాహరణ :**

మన తెలుగును వివిధ ప్రాంతాలలో ఎలా మాట్లాడతారో ఇక్కడ చదవడం కంటే ఒకసారి విన్నప్పుడు చాలా ఆనందం, అవగాహన కలుగుతాయి. వివిధ ప్రాంతాల ప్రజలు తెలుగు భాషను ఎలా మాట్లాడతారో చూద్దాం!

> జీవితం కళను సజీవపరుస్తుంది. కళ జీవితాన్ని ఆనందపరుస్తుంది. జీవితం వ్యక్తపరుస్తుంది. కళ గుప్త పరుస్తుంది. ఈ విధంగా కళ బహిర్గతం కంటే అంతర్గతమే అధికం.
>
> – సంజీవదేవ్

**1) వరంగల్ :**

ఏందిరా! వాడు గొడ్తాండు, వీడు గొడ్తాండంటవ్ నీ అక్క... పొడుత్తరరోయ్ ...

**2) తిరుపతి :**

ఏం స్వామి! పై కెళ్లిపోతావా పైకీ ... (యాసగా)

( తిరుపతిలో ఎక్కువగా 'స్వామి' అంటూ సంభోదిస్తారు. పైకి అంటే కొండ పైకి. వేరే విధంగా బావించవద్దని ఒక కొసమెరుపు తగిలిస్తే ప్రేక్షకులు హాయిగా నవ్వుకుంటారు.)

**3) హైదరాబాద్ :**

రవి :- అరె! ఏందిరా బై! వస్తుంటివి అని ఫోన్ చేసినవు. నిన్న రాలేదేందిర బై నువ్వు! అరె మస్తు గున్నవ్ బై నువ్వు.

రాజు :- అరె! 'రోజీ' లేదార బై దాని వెంట పడుతున్నా.

రవి :- అరె! బిడ్డా! దాన్ని పట్టాలంటే బండి ఉండాల్రా, బండి ఉంటే మస్తు పటాయించొచ్చురా బై!

( హైదరాబాద్ వాళ్లు మాట్లాడేటపుడు 'బై' అనీ, 'మస్తు' అని ఇంకా ఉర్దూ, హిందీ పదాలు అనేకం తరుచూ దొర్లుతుంటాయి.)

ఒక మంచి అనుకరణ ఒక గొప్ప వాస్తవికతతో సమానం.

\- వోల్టేర్

**4. విజయవాడ :**

ఏం 'గురూ' బాగున్నావా! ఎక్కడికి వెళుతున్నావు. సినిమాకా! అబ్బే నేనూ వస్తున్నానండి. మా ఆవిడ కూడా వస్తుంది. రెండు టికెట్స్ తీసిపెట్టండి.

అప్పారావు :- ఏమండి, మీకు ఎంత మంది పిల్లలు ?
సుబ్బారావు :- ఏదో మీ దయవల్ల ఇద్దరు.

'ఆయన దయ వల్ల ఇద్దరట' అనే విషయాన్ని వ్యంగ్యబాణీలో కొస మెరుపులాగా వెంటనే తగిలించినపుడు ప్రేక్షకులు పరమానందం పొందుతారు.

(ఆంధ్రా ప్రాంతంలో తెలుగు స్వచ్ఛంగా ఉచ్ఛరిస్తారు. వ్యవహారిక భాషలో ఎక్కువగా 'గురూ' అనే పదం గమనించవచ్చు.)

**5) కాకినాడ :**

ఏవండీ, ఎక్కడి కెళ్ళాలి!
కోవెలకాండి?
కోవెల కంటె నేరుగ... ఎల్లిపోవాలండి.

(తెలంగాణాలో 'గుడి' అనీ, ఆంధ్రా ప్రాంతంలో 'కోవెల' అనీ అంటారు. తెలంగాణాలో 'చక్కగా' అనీ, కాకినాడలో 'నేరుగా' అనీ సాగదీస్తూ పలుకుతారు.)

> భగవంతుడు ఒక గొప్ప కళాకారుడుగా ఈ ప్రపంచాన్ని నిర్మించాడు. అందుచేత కళాకారుల నుండే ప్రపంచం నేర్చుకోవలసింది ఎంతో ఉంది.
>
> \- జార్జి బెర్నార్డ్ షా

**6) రాజమండ్రి :**

ఏవండి! మీ అమ్మగారు చాలా గొప్పవారు కదండి.

ఆయ్ అండి.

మీ నాన్నగారు కూడా చాలా గొప్పవారు కదండి.

ఆయ్ అండి.

మీరు చాలా దుర్మార్గులు కదండి.

ఆయ్ అండి... అయ్యబాబోయ్ కాదండి.

(రాజమండ్రిలో 'ఆయ్ అండి' అనే పదం ఎక్కువగా ఉపయోగిస్తారు.)

ఈ విధంగా కళాకారుడు వివిధ ప్రాంతాలు, రాష్ట్రాలు, దేశాలు తిరుగుతుంటే అనుభవం వలన, పరిశీలనా శక్తితోటి అనేక రకాల **Pronounciations** ఆధారంగా రకరకాల సన్నివేశాలను సృష్టించి తయారు చేసికొనగలుగుతాడు. ఆయా ప్రాంతాలకు వెళ్ళినపుడే ఆయా భాషలపై అతనికి ఉచ్చారణ (యాస) మీద మంచి అవగాహన ఏర్పడుతుంది.

మిమిక్రీలో చివరి భాగమైన వాయిద్యాలను అనుకరించడం గురించి చర్చిద్దాం.

తరానికో వంద కవులు తయారవుతారెప్పుడూ,
వందలోను మందలోను మిగల గలిగేదొక్కడే.

- ఆరుద్ర

# VII



# వాయిద్యాలను (Instrument's) అనుకరించడం

వాయిద్యాలను అనుకరించడం మిమిక్రీలో 7వ భాగం. ఇదే చివరి భాగము కూడా. వీటి ఆధారంగా ఆయా వాయిద్యాలు ఇలా పలుకుతాయని వినిపించి భ్రాంతి కల్గించవచ్చును. అంటే Instrument's లేకున్నా పిల్లలందరికి ఆయా వాయిద్యాల గూర్చిన అవగాహన కల్పించవచ్చును. ఇందులో ముఖ్యంగా నాదస్వరం, సన్నాయి, బాజాభజంత్రీలు, సితార్, మువ్వల చప్పుడు, వయోలిన్, కీ-బోర్డ్, కాంగో, బాంగో (తబల), పియానో, ఫ్లూట్ మొదలగు అనేక రకాల సంగీత వాయిద్యములను అనుకరించి వినిపించడము వలన ఆయా వాయిద్యాలు కార్యక్రమములో ఉన్నట్లు భ్రాంతి కలుగుతుంది. ప్రేక్షకుల హృదయాలు రసానుభూతిని పొందుతాయి.

ప్రశంసలు మూర్ఖులచే పొందడం కన్న, బుద్ధిమంతులచే తిట్లు తినడం మిన్న.

\- షేక్స్పియర్

**ఉదాహరణ :**

1) పెళ్లి మంత్రాలను పురోహితులు ఎలా చదువుతారో అలా చదివి విన్పిస్తూ బాజాభజంత్రీలు, సన్నాయి రాగం కూడ జతపరచి విన్పించినపుడు ప్రక్క దారి నుండి వెళ్తున్న వారికి నిజంగా ఇక్కడ పెళ్లి జరుగుతుందనే భ్రాంతి కలిగి ప్రోగ్రామ్ వైపు చూస్తారు.

2) మువ్వల శబ్దం అనుకరించినపుడు ఎవరైనా కాళ్లకు మువ్వలు కట్టుకొని వస్తున్నారా! అన్న భ్రాంతిని కల్గించవచ్చు.

3) వివిధ రకాల వాయిద్యాలతో వివిధ రకాల రాగాలను అనుకరించవచ్చును.

ఈ విధంగా ఏడు భాగాలు అనుకరించగల వారిని సంపూర్ణమైన మిమిక్రీ కళాకారులుగా పరిగణించవచ్చును.



ఒక లక్ష్యంతో కృషిచేస్తే ప్రతి వ్యక్తికి నేడు కాకపోయినా, రేపైనా బాగుపడే అవకాశం వచ్చి తీరుతుంది.

\- స్మైల్స్




"Venter" అంటే Stomach. "Loquism" అంటే do not lips movement but sound is produced. అంటే పెదవులు కదపకుండ Stomach ఆధారంగా మాట్లాడటము అన్నమాట.

మిమిక్రీ వచ్చినవారికి ఈ ఆర్ట్ నేర్చుకోవడము ఏమంత కష్టమైనపని కాదు. ఎందుకంటే గొంతు మార్చిపలకడం వారికి అలవాటైన పనికాబట్టి. ఇటు తను మాట్లాడుతూ మరొకవైపు బొమ్మవలె తానే మాట్లాడవలెను. అంటే చాలా Speed Activity తో పాటు రెండు గొంతులకు మధ్య స్పష్టమైన తేడా ఉండాలి. అంతేగాని బొమ్మ గొంతు ఇలాగే ఉండాలి, ఇలాగే మాట్లాడాలనే రూల్ ఏమీ లేదు. రెండు గొంతుల మధ్య తేడా ఉంటే సరిపోతుంది. అప్పుడు ప్రేక్షకులకు ఇద్దరు మాట్లాడినట్లు

> 'కళ' ను కనబడకుండా ప్రదర్శించడంలోనే 'కళానైపుణ్యం' వున్నది.
>
> \- ఓవిడ్

బొమ్మ శ్రీనివాస్

**సూచనలు :**

1) పెదవులను కన్పించి కన్పించనంతగ కొద్దిగ తెరచి ఉంచాలి. ఎందుకంటే పూర్తిగ నోరు మూసి పలికితే మనం ఏం చెబుతున్నామో ప్రేక్షకులకు అర్థం కాదు.

2) వెంట్రిలాక్విజమ్‌లో బొమ్మ మాట్లాడే పదాలు నోటి నుండి యే గాక, ముక్కు ద్వారా వచ్చునట్లు పలుకవలెను.

3) రెండు పెదవులను వత్తి పట్టి పలుకు **ప,బ,మ** లాంటి అక్షరాలు వచ్చినపుడు వాటికి బదులుగ '**క**' అని స్పీడ్‌గా పలుకవలెను.

4) ప్రోగ్రాంలో మాట్లాడే పదాలు స్పష్టంగా వచ్చేంత వరకు **practice** చేయవలెను.



రాష్ట్ర మాజీ రోడ్లు, భవనాల శాఖమాత్యులు శ్రీ తక్కెళ్ళపెల్లి పురుషోత్తమరావు గారు ప్రత్యేకంగా అభినందిస్తున్నప్పటి దృశ్యం...

ఒకరి గుణ గణాలు పరీక్షించి చూడాలనుకుంటే, అతనికి ఒకసారి అధికారం ఇచ్చి చూస్తే చాలు.

– అబ్రహాం లింకన్

**వెంట్రిలాక్విజమ్ స్క్రిప్ట్ నెం. 1 :**

కళాకారుడు : హలో

మాట్లాడే బొమ్మ : హలో... ఎవరయ్యా

కళాకారుడు : నీ పేరు?

మాట్లాడే బొమ్మ : టోని

కళాకారుడు : టోని ... చాలా బాగుంది

మాట్లాడే బొమ్మ : **Thank's**

కళాకారుడు : మీ ఇల్లు ఎక్కడ?

మాట్లాడే బొమ్మ : హైదరాబాద్

కళాకారుడు : హైదరాబాద్‌లో మీ ఇల్లు ఎక్కడ?

మాట్లాడే బొమ్మ : చిరంజీవి ఇంటి ముందు

కళాకారుడు : మరి ... చిరంజీవి గారి ఇల్లు ఎక్కడ ?

మాట్లాడే బొమ్మ : మా ఇంటి ముందు

కళాకారుడు : అలాకాదు ... చిరంజీవి ఇల్లు మీ ఇంటి ముందు. మీ ఇల్లు చిరంజీవి ఇంటి ముందు. మీ ఇద్దరి ఇళ్ళు హైదరాబాద్‌లో ఎక్కడ ఉన్నాయి?

మాట్లాడే బొమ్మ : ఎదురెదురుగా

కళాకారుడు : చూడు... నీతో మాట్లాడాలంటే చాలా కష్టం

మాట్లాడే బొమ్మ : అయితే నీ యిష్టం

కళాకారుడు : మీ నాన్న గారు ఏం చేస్తుంటారు ?

> ఆనందం కలిగినప్పుడు అది నలుగురికి పంచిపెట్టు కాని విషాదం సంభవించినప్పుడు మాత్రం అది నీ దగ్గరే దాచుకో.
>
> – సుభాషిత రత్నావళి

మాట్లాడే బొమ్మ : ఇంజనీరు

కళాకారుడు : ఇంజనీరా!

మాట్లాడే బొమ్మ : అవునయ్యా

కళాకారుడు : మా ఫ్రెండ్స్ కాదంటున్నారు. నిజంగా మీ నాన్నగారు ఏంచేస్తారు?

మాట్లాడే బొమ్మ : ఇంజన్‌లో నీళ్లుపోస్తుంటారు

కళాకారుడు : ఇంజన్‌లో నీళ్లు పోస్తే ఇంజనీరా!

మాట్లాడే బొమ్మ : అవునయ్యా!

కళాకారుడు : మీ నాన్నగారి పేరు ?

మాట్లాడే బొమ్మ : దొండకాయ

కళాకారుడు : మీ అమ్మ గారి పేరు ?

మాట్లాడే బొమ్మ : బుడంకాయ

కళాకారుడు : అందుకే పొట్టిగ ఉన్నావా?

మాట్లాడే బొమ్మ : అవునయ్యా

కళాకారుడు : మరి నీ కాళ్లు చేతులు పని చేస్తున్నాయా?

మాట్లాడే బొమ్మ : చేయడం లేదు

కళాకారుడు : ఎందుకు?

మాట్లాడే బొమ్మ : నేను... పోలియో చుక్కలు వేయించుకోలేదు.

ఈ విధంగా పిల్లలకు, గ్రామస్థులకు పోలియో చుక్కలు వేయించుకోకపోతే జరిగే అనర్థాలను బొమ్మ ద్వారా అందరికి అర్థం అయ్యేలా చూపించవచ్చును. మాట్లాడే బొమ్మ ఒక అమ్మాయితో మాట్లాడే సన్నివేశం చూద్దాం.

> రాత్రివేళ సూర్యుడు కనిపించలేదని కన్నీరు కారుస్తుంటే ఆఖరికి నక్షత్రాలు కూడా నీకు కనిపించకుండా పోతాయి.
>
> \- రవీంద్రనాథ్ ఠాగూర్

**వెంట్రిలాక్విజమ్ స్క్రిప్టు నెం. 2 :**

('బొమ్మ' ఒక అమ్మాయితో మాట్లాడే సన్నివేశం)

| | | |
|---|---|---|
| కళాకారుడు | : | అమ్మాయి వచ్చేసింది ఇటు కాదు అటు చూడు |
| మాట్లాడే బొమ్మ | : | సిగ్గేస్తుంది |
| కళాకారుడు | : | అమ్మాయి సిగ్గుపడాలి గాని నీ కెంటి? నేను పక్కనే ఉన్నాగా మాట్లాడు |
| మాట్లాడే బొమ్మ | : | సిగ్గేస్తుంది గురువుగారు |
| కళాకారుడు | : | పరవాలేదు... మాట్లాడు |
| మాట్లాడే బొమ్మ | : | నీ పేరు? |
| కళాకారుడు | : | నీ పేరు (వెంటనే అనాలి) |
| మాట్లాడే బొమ్మ | : | నీ కెందుగ్గురువుగారు? |
| కళాకారుడు | : | అంటే మధ్యలో నేను రావద్దు! అవునా? |
| మాట్లాడే బొమ్మ | : | అవునయ్యా |
| కళాకారుడు | : | అంటే మీరిద్దరే మాట్లాడుకుంటారా? |
| మాట్లాడే బొమ్మ | : | పర్సనల్‌గా |
| కళాకారుడు | : | సరే! మాట్లాడుకోండి |
| మాట్లాడే బొమ్మ | : | నీ పేరు? |
| కళాకారుడు | : | నీ పేరు (వెంటనే అనాలి) |
| మాట్లాడే బొమ్మ | : | నీకెందుకు? |
| కళాకారుడు | : | సరె! నేను అసలే అడుగను. మాట్లాడుకోండి |

పిసిని గొట్టువాడు పేదవాడుగా కనిపిస్తూ అమిత ధనవంతుడవుతాడు. విలాస పురుషుడు ధనవంతుడిగా కనిపిస్తూనే పేదవాడవుతాడు.

– గనిస్టన్

| | | |
|---|---|---|
| మాట్లాడే బొమ్మ | : | నీ పేరు? |
| అమ్మాయి | : | భవానీ |
| మాట్లాడే బొమ్మ | : | బాగుంది |
| కళాకారుడు | : | పేరు బాగుందా! |
| మాట్లాడే బొమ్మ | : | అమ్మాయి కూడా బాగుంది |
| కళాకారుడు | : | సరె! ఇంకా ఏమైనా అడుగు |
| మాట్లాడే బొమ్మ | : | ఎన్నో తరగతి చదువుచున్నావు? |
| అమ్మాయి | : | ఆరు |
| మాట్లాడే బొమ్మ | : | నేను ఏడు |
| కళాకారుడు | : | ఏమిటి! ఆ అమ్మాయి 6 అయితే నువ్వు 7వ తరగతా? |
| మాట్లాడే బొమ్మ | : | అవునయ్యా |
| కళాకారుడు | : | నువ్వు కూడా 6వ తరగతే కదా! ఒక్క తరగతి ఎందుకు ఎక్కువ చేసి చెప్పావు? |
| మాట్లాడే బొమ్మ | : | లైన్ కలుపుకుందామనీ... |
| కళాకారుడు | : | ఇంకా అడుగు |
| మాట్లాడే బొమ్మ | : | మీ డాడి పేరు? |
| అమ్మాయి | : | బాబురావు |
| మాట్లాడే బొమ్మ | : | నాకు తెలుసు |
| కళాకారుడు | : | వీళ్ల డాడీ నీకు ఎలా తెలుసు? |
| మాట్లాడే బొమ్మ | : | నా **Classmate** |

హృదయంలేని మాటలకన్నా, మాటలులేని హృదయం మిన్న.

– సుభాషిత రత్నావళి

కళాకారుడు : ఇంకా ఏమైనా అడుగు

మాట్లాడే బొమ్మ : నీకు లెక్కలు వచ్చా?

కళాకారుడు : వచ్చు

మాట్లాడే బొమ్మ : రెండు, రెండు ఎంత?

అమ్మాయి : నాలుగు

మాట్లాడే బొమ్మ : లేదు

కళాకారుడు : మరి ఎంతో నువ్వు చెప్పు

మాట్లాడే బొమ్మ : రెండు, రెండు

కళాకారుడు : ఆ... రెండు రెండు

మాట్లాడే బొమ్మ : ఇరవైరెండు

కళాకారుడు : చాలా బాగుంది

మాట్లాడే బొమ్మ : ఎవడన్నాడు?

కళాకారుడు : ఇంకా మాట్లాడు

మాట్లాడే బొమ్మ : ఏ స్కూల్?

కళాకారుడు : సరస్వతి శిశు మందిర్

మాట్లాడే బొమ్మ : నేను ఆ స్కూల్‌లో చేరతా!

కళాకారుడు : ఎందుకు?

మాట్లాడే బొమ్మ : అమ్మాయి కోసం

**వెంట్రిలాక్విజమ్ స్క్రిప్ట్ నెం. 3 :**

(అబ్బాయితో బొమ్మ మాట్లాడటం)

అంతరాత్మ అనే కావలికుక్క మనం చేసే నేరాలపట్ల మొరుగుతుంది.

- బాబ్ ఎడ్వర్డ్స్

బొమ్మ శ్రీనివాస్

| | | |
|---|---|---|
| మాట్లాడే బొమ్మ | : | నీ పేరు? |
| అబ్బాయి | : | మణిదీప్ |
| మాట్లాడే బొమ్మ | : | నాకు తెలుసు |
| కళాకారుడు | : | ఈ అబ్బాయి ఇప్పుడే కదా వచ్చింది నీకు ఎలా తెలుసు!? |
| మాట్లాడే బొమ్మ | : | మా ఇంటి ప్రక్క అమ్మాయిని లవ్ చేస్తున్నాడు. |
| కళాకారుడు | : | ఏమయ్యా బాబు, వీళ్ల ఇంటి పక్క అమ్మాయిని లవ్ చేస్తున్నావా! |
| అబ్బాయి | : | చేయడం లేదు |
| కళాకారుడు | : | ఏం చేయడం లేదు? |
| అబ్బాయి | : | **Love** |
| కళాకారుడు | : | అ అబ్బాయి **Love** చేయడం లేదట. ఒకవేళ **Love** చేశాడే అనుకుందాం. నీకెందుకు? |
| మాట్లాడే బొమ్మ | : | నేను కూడ అ అమ్మాయినే... |
| కళాకారుడు | : | ఆ అమ్మాయినే... |
| మాట్లాడే బొమ్మ | : | **Love** చేస్తున్నా! |

ఈ విధంగా హాస్యాన్ని పండించడమే కాకుండా వెంట్రిలాక్విజం (మాట్లాడేబొమ్మ) ఆధారంగా సరదాగా అమ్మాయి, అబ్బాయితో మాట్లాడటమే కాక, పోలియో చుక్కలు వేయించుకొనకపోతే కలిగే అనర్థాలు, పాన్,గుట్కాలు, ధూమపానం, మద్యపానం

> అన్ని రకాల ప్రేమలలో నీచమైనది డబ్బు పట్ల ప్రేమ.
>
> \- యంగ్

సేవించడం వలన కలిగే అనర్థాలను, ఎయిడ్స్, కుటుంబ నియంత్రణ, మెదడు వాపు వ్యాధి గురించి వివరంగా గ్రామ ప్రజలకు, పిల్లలకు అందరికీ అర్థం అయ్యేలా చిన్నచిన్న కథల ఆధారంగా బొమ్మతో చెప్పించవచ్చును.

మాట్లాడేబొమ్మ స్వరాన్ని **(voice)** ఆత్మ అనుకుంటే, ఈ ఆత్మను బయటకు తీసి ఒక బంతిలోనికి గాని, మరొక చిన్న బొమ్మలోనికి గాని ప్రవేశపెట్టి మాట్లాడించవచ్చును. ఆత్మను ఒక డబ్బాలో వేసి మూతపెడితే ఎలా మాట్లాడుతుందో అప్పుడు మనకు పౌనఃపున్యము **(frequency)** తగ్గి ఎలా వినబడుతుందో, మూత తెరిచినప్పుడు ఫ్రీక్వెన్సీ ఎలా పెరుగుతుందో విన్పించినప్పుడు ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యాలకు లోనవుతారు. ఇంకా అనేక రకాల వినూత్న రీతులలో విభిన్నమైన పద్ధతుల ద్వారా వెంట్రిలాక్విజంను ప్రదర్శించవచ్చును.



జీవితం అంటే ఒక సమస్య నుంచి మరొక సమస్యకు ప్రయాణం మాత్రమే. ఏ సమస్యలు లేని జీవితమంటూ ఉండదు.

– ప్రాచీన సూక్తి




'జుగల్ బంది' అనే పదం 'పర్షియన్' భాష నుండి వచ్చినట్లు చెబుతుంటారు. అంతే కాకుండా ఉత్తర్‌ప్రదేశ్ రాష్ట్రం లోని లక్నో పట్టణము నుండి వలస వచ్చిందని కూడా కొందరి అభిప్రాయం. ఏది ఏమైనా జుగల్‌బంది అంటే 'గ్రూప్ ఐటమ్' అని ఒక్క మాటలో చెప్పొచ్చు. దీనిని సంగీత కచేరీలలో ఎక్కువగా చూస్తాం. సంగీతంలో మృదంగం, తబల, సితార్, ఢోలక్, వీణ ఇలా 10 మంది కళాకారులు ఒక రాగమును తీసుకొని ఒకరి తరువాత ఒకరు వాయిస్తూ చివరిగా అందరూ కలిసి అదే రాగాన్ని ఏకకాలంలో వాయిస్తారు. ఇలా ఏకకాలంలో కళాకారులందరు కలిసి చేసే ఈ అద్భుత సంగీత ప్రక్రియను 'జుగల్‌బంది' అని అంటారు.

సరిగ్గా అదే విధంగా మిమిక్రీలో కూడా కొందరు కళాకారులు ఈ పద్ధతిని ప్రవేశపెట్టడం జరిగింది. ఇందులో నలుగురు లేదా ఐదుగురు

> నీవు గొప్ప ప్రతిభా సంపత్తులు కలిగి ఉంటే, శ్రమ వాటికి మెరుగు దిద్దుతుంది. ఒక మాదిరి సామర్థ్యాలు కలిగి వుంటే, శ్రమ వాటి లోటుపాట్లను సవరిస్తుంది.
>
> – శామ్యూల్ స్మైల్స్

కళాకారులు ఒక్కొక్కరు, ఒక్కొక్క మౌత్‌పీస్ తీసికొని ఏకకాలంలో ఒక సన్నివేశాన్ని అనుకరించడమే మిమిక్రీ జుగల్‌బంది. దీని వలన ప్రేక్షకులకు వీక్షిస్తున్న సన్నివేశం యదార్థంగా కళ్లముందు కన్పించినంతగ భ్రాంతి కలుగుతుంది.

జుగల్ బంది ఐటమ్స్ చేస్తున్నప్పుడు మిమిక్రీ కళాకారులు ముందు ఎవరు ఏ శబ్దం చేస్తారో అనుకొని, నాలుగు లేదా ఐదుసార్లు రిహార్సల్స్ చూసుకొని ప్రేక్షకుల ముందు ప్రదర్శించాలి. రిహార్సల్స్ లేకుండా ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ జుగల్‌బంది చేయకూడదు. ఎందుకంటే నలుగురు ఒకేసారి ఒకే శబ్దం చేశారనుకోండి, అప్పుడు ఆ సన్నివేశం మొత్తం అస్పష్టంగా వినిపించి ఫెయిల్ అవుతుంది. అందువలన తప్పని సరి రిహార్సల్స్ చేసి ప్రేక్షకుల ముందు ప్రదర్శించాలి. మరి ఈ జుగల్‌బంది ద్వారా మిమిక్రీ కళాకారులు ఈ క్రింద పేర్కొన్న ఐటమ్స్ చేయవచ్చును.

## జుగల్ బందిలో చేసే ఐటమ్స్

**1. పల్లె మేల్కొలుపు :**

పల్లె నిద్రలేస్తున్నపుడు కోడిపుంజు కొక్కొరొక్కో అన్న శబ్దం మొదలు పక్షుల అరుపులు, కోకిల కూతలు, చిలుకలు అరుస్తున్న శబ్దాలు, ఆవు అంబా అనడం, మేక - మేకపిల్ల అరుపులు పదే పదే చేస్తూ మరో కళాకారుడు యం. యస్. సుబ్బులక్ష్మిగారి గాత్రం 'కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే' అంటుంటే, పాలవాడు పాలొచ్చినాయమ్మా.. అన్న పిలుపు, మసీద్ నుండి 'అల్లా హు అక్బర్, అల్లా హు అక్బర్'

మనం ప్రదర్శించే ప్రతిభా సామర్థ్యాల ద్వారా యితరుల హృదయాలను ఆకట్టుకుంటాం. మనకున్న అర్హతల ద్వారా వాటిని పదిలపరచుకుంటాం.

\- స్వార్గ్

అంటూ ఇచ్చే అజాం ( నమాజ్‌కు పిలుపు) ఇలా ఈ శబ్దాలను నలుగురు కళాకారులు ఆయా శబ్దాలను పంచుకొని అందరూ ఒకేసారి పదే పదే చేస్తున్నప్పుడు నిజంగా పల్లె మేల్కొంటున్నట్లు భ్రాంతి కలిగించవచ్చును.

**2. మహానగరం (మెట్రోసిటీ)లో వాతావరణం :**

సిటీలో ఎక్కువగా వుండే మోటార్ వాహనాలైన బైక్‌లు, స్కూటర్‌లు, బస్సులు, లారీలు, ఆటోలు, జీపులు, పోలీసు జీపుల సైరన్‌లు, అంబులెన్స్‌లు, విమాన శబ్దాలు , రైలు శబ్దాలు మొదగలగునవి పదే పదే చేస్తూ సిటీ వాతావరణం ఇలా ఉంటుందని విన్పించవచ్చును.

**3. యుద్ధ వాతావరణం :**

రెండవ ప్రపంచ యుద్ధం లేదా కార్గిల్ యుద్దంలో మిస్సైల్స్, మిషన్‌గన్స్, విమానాలు, హెలికాప్టర్‌లు, ఫిరంగులు, అంబులెన్స్‌లు మొదలగు శబ్దాలనే కాకుండా, సైనికుల మాటలు సైతం అనుకరించినపుడు ఆ సన్నివేశం అద్భుతంగా ఉంటుంది.

**4. అడవి మేల్కొలుపు :**

అడవిలో అప్పుడే నిద్రలేస్తున్న జంతువుల అరుపులను అనుకరిస్తూ 'అడవి మేల్కొలుపు' అనే సన్నివేశం సృష్టించవచ్చును. ఇందులో భాగంగా వివిధ రకాల జంతువుల అరుపులనన్నింటిని అనుకరించ వచ్చును.

> మానవుని ప్రతిభా పాటవాలు సూర్యకిరణాలవలె విస్తరిస్తాయి.
> అవి కేంద్రీకృతమైతే ప్రకాశిస్తాయి.
>
> \- స్వామి వివేకానంద

**5. ప్రధాని సభ :**

ప్రధానమంత్రి సభకు వస్తున్న సమయంలో పోలీసు జీపు సైరన్, షాన్‌ఫ్రాన్సిస్కో జీపు సౌండ్, హెలికాప్టర్ వస్తున్న శబ్దం, ప్రజలు జిందాబాద్... జిందాబాద్... అని ముక్తకంఠంతో చేసే హర్షధ్వానాలను ప్రధానమంత్రి ఇచ్చే స్పీచ్, ప్రజల చప్పట్లు ఈ విధంగా ఒక సన్నివేశం మొత్తం అనుకరించవచ్చును.

**6. రైల్వే ప్లాట్‌ఫారం సన్నివేశం :**

**Train Start** అవుతున్నప్పుడు, ప్లాట్‌ఫామ్ మీద నడిచే వివిధ వ్యక్తుల గొంతులు, టీ, కాఫీ, పేపర్, పల్లి అమ్ముకునేవారి మాటలు, మైక్‌లో అనౌన్స్‌మెంట్, **Train** కూత, రైల్ ఇంజన్ నుండి గ్యాస్ లీక్ అవడం, ట్రేన్ మెల్లిగ ప్రారంభమై స్పీడ్ అందుకోవడం వరకు అనుకరించినపుడు ప్రేక్షకులు నిజంగా రైల్వేస్టేషన్‌లో ఉన్నంత అనుభూతిని పొందుతారు. ఇందులో మిమిక్రీ కళాకారుడు ఒక్కొక్క సౌండుని ఎంచుకొని సన్నివేశానికి అనుగుణంగా అనుకరించినప్పుడు ప్రేక్షకులు రసానుభూతిని పొందుతారు.

ఒక దురభ్యాసానికి అయ్యే ఖర్చుతో ఇద్దరు బిడ్డలను పెంచి పోషించవచ్చు.

- ఫ్రాంక్లిన్




మిమిక్రీ కళాకారునికి 'చతుర్విధాభినయములు' తెలిసి ఉండటం చాలా అవసరం. 'చతుర్విద' అంటే నాలుగు రకాలనీ, 'అభినయము' అంటే నటన అని అర్థం. అనగా నాలుగు రకాలుగా నటించడమని దీని పరమార్థం. అవి

1. ఆంగికాభినయం
2. వాచికాభినయం
3. సాత్వికాభినయం
4. ఆహార్యాభినయం

పై నాల్గింటిని కలిపి 'చతుర్విధాభినయములు' అంటారు

నిజం చెప్పడానికి ఎంతో ధైర్యం వుండాలి. అలాగే నిజం ఒప్పుకోడానికి కూడా అంతకు మించిన ధైర్యం వుండాలి.

- ఆర్.కె. నారాయణ్

**1) ఆంగికాభినయము :**

ఆంగికాభినయానికి 'శారీరక అభినయం' అని పేరు. శరీరాంగముల కదలికలతో వ్యక్తీకరించు విధానమును ఆంగికాభినయము అంటారు. ఆంగీకాభినయమును 5 భాగాలుగా విభజింపవచ్చును. అవి

a. అంగవిన్యాసాలు

b. భంగిమలు

c. కదలిక

d. మూకాభినయం

e. గతివిన్యాసాలు

**a. అంగవిన్యాసాలు :**

చేతులు, కాళ్ళు, తల, కళ్లు, పెదవులు, బుగ్గలు, ముక్కు, కనుబొమ్మలు మొదలగు వాటి కదలికలతో చేయు అభినయములు 'అంగవిన్యాసాలు'.

**b. భంగిమలు :**

ఒక కదలిక పూర్తయిన తరువాత నిశ్చలంగా ఉన్నటువంటి స్థితిని 'భంగిమ' అంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే 'స్టిల్స్' ఇవ్వడము లాంటిది.

**c. కదలిక :**

ఒకే స్థలంలో నిల్చొని స్థానచలనం లేకుండ ప్రదర్శించు అభినయం.

కొద్దిపాటి కోరికలున్నవాడే అందరికంటే ధనవంతుడు.

- సిసిరో

1. మూకాభినయం :

పాత్రలు సంభాషణల రూపంలో గాక, అంగవిన్యాసం ద్వారా భావాలను వ్యక్తీకరించే విధానాన్ని 'మూకాభినయం' అంటారు. దీనిని అచ్చ తెలుగులో 'చేష్టానుకరణ' అనీ, ఇంగ్లీషులో 'మైమ్' అని అంటారు.

2. గతి విన్యాసాలు :

స్థాన చలనం చెందుతూ ప్రదర్శించు అభినయం.

**2) వాచికాభినయము :**

మాటల ద్వారా, పాటల ద్వారా భావాలను వ్యక్తపరచడాన్ని 'వాచికాభినయం' అంటారు. జంతువుల, మనుష్యుల మనస్సులో ఉన్న భావాల్ని అవతలి వారికి వ్యక్తపరచటానికి 'వాచికాభినయము' ఎంతో తోడ్పడుతుంది. అయితే మనిషి ఆలోచన చేత ఈ శబ్దాలను అక్షరాలు, పదాలు, వాక్యాలుగా మలచి సులభంగా అర్థం చేసుకొనే దిశలో భాషను రూపొందించుకున్నాడు. ఆ విధంగా ఇండియా మొత్తంలో దాదాపు **1652** భాషలు ఏర్పడినాయి. ఈ విధంగా రూపొందించుకున్న భాషల నుండి మనిషి తన మనస్సులో వ్యక్తమయిన భావాలను వ్యక్తీకరించ గలుగుచున్నాడు. అందుకే మిమిక్రీ కళాకారుడు అందరికి సులభంగా అర్థమయ్యేలా మరియు వారికి చక్కగ విన్పించుటకు గాను వాచికమును సాధనచేత 'ప్రొజెక్ట్' చేయవలెను.

తెలివిగల వ్యక్తి, తన ఆర్థిక విషయాలను, మానసిక సంఘర్షణలను, గృహసంబంధమైన విషయాలను ఎప్పుడూ రహస్యంగానే వుంచుతాడు.

– సంస్కృత సూక్తి

**3) సాత్వికాభినయము :**

ముఖ కవళికల ద్వారా భావాలను వ్యక్తపరచుటను 'సాత్వికాభినయం' అంటారు. నవరసాలను సాత్వికాభినయం ద్వారా ప్రదర్శింపవచ్చును. చతుర్విధాభినయములలో ఉత్తమ అభినయం ఏదంటే సాత్వికాభినయమే.

**4) ఆహార్యాభినయము :**

వేషధారణ ద్వారా కళను ప్రదర్శించడమును 'ఆహార్యాభినయము' అంటారు. ఒక కథ చెప్పినపుడు కథలోని పాత్రలకు సరితూగే వేషధారణ చేసి అభినయించడము.

ఈ విధంగా మిమిక్రీ కళాకారునికి చతుర్విధాభినయములు తెలిసినపుడు అతడు ప్రదర్శించే మిమిక్రీ అద్భుతంగా వుండి ప్రేక్షకుల హృదయాలను చూరగొనగల్గుతాడు. అలాగే మిమిక్రీ కళాకారుడికి నాటక రంగ అనుభవం కూడా ఉన్నట్లయితే మిమిక్రీ కళ ప్రదర్శనలో పరిపూర్ణత కనిపిస్తుంది. అందుకే ప్రతి మిమిక్రీ కళాకారుడు అప్పుడప్పుడు నాటకాలలో పాత్రల్ని ఎన్నుకొని ప్రదర్శించాలి, నాటకాలలో పాల్గొనాలి. అలాగే నాటక రంగానికి సంబంధించిన అనుభవం మిమిక్రీ కళాకారునికి ఉన్నప్పుడు మిమిక్రీ కళను సమర్థవంతంగా ప్రదర్శించుటకు వీలవుతుంది. అనగా మిమిక్రీ కళాకారుడు ఏ మాత్రం సమయం చిక్కినా నాటకాలలో వేషాలు వేయటం చాలా ఉత్తమం.

> ఎదుటివారు మనల్ని అర్థం చేసుకోలేకపోవటం మనకు అంతగా సంబంధం లేని విషయం. మనం ఎదుటివారిని అర్థం చేసుకోలేకపోవటం పూర్తిగా మనకు సంబంధించిన విషయం.
>
> - కన్ఫ్యూషియస్




సంఘంలోని ప్రతి వ్యక్తి అనుకరణ **(imitation)** అనేది లేకుండా జీవించలేడు. ప్రతి ఒక్కరూ ఆయా సందర్భాలలో అనుకరణ అనేది ప్రదర్శిస్తుంటారు. మానవుడు తన సమస్త విజ్ఞానాన్ని అనుకరణ ద్వారానే నేర్చుకున్నాడు. అనుకరణకు తన ఆలోచనా పరిజ్ఞానాన్ని జోడించి ప్రదర్శించే నైపుణ్యత, సమర్థతల వల్లనే అడవులలో సంచరిస్తూ మృగప్రాయ జీవితాన్ని గడిపిన నాటి మనిషి కాలక్రమేణా నాగరికుడై సకల సుఖాలను అనుభవిస్తూ విజ్ఞానం ద్వారా పొందిన అనుకూలతల వల్ల కాలాన్ని మిగుల్చుకొని ఆ కాలాన్ని తన మానసిక వికాసం కోసం వినియోగిస్తూ, కళల్ని కళారూపాల్ని రూపొందించుకుంటూ తన సృజనాత్మకతను తాను అనుభవించి ఇతరులకు కళల ద్వారా ప్రదర్శించి ఆనందిస్తూ, ఆనందింపజేస్తున్నాడు.

> కళ అన్నది సంగమ స్థానము. కళాకారుడూ, కళను చూసి ఆనందించేవారు అక్కడ కలుస్తారు.
>
> \- గ్లోబల్ సూక్తి

జంతువుల - పక్షుల హావభావాలు, అరుపులను చూసి 'భాష'ను, పక్షుల గూళ్ళు, జంతువుల పొదలు, గుహలను చూసి గృహ నిర్మాణం, సాలీడు అల్లికలను చూసి దుస్తుల తయారీ, పక్షులు ఎగరటం చూసి ఆకాశయానం (విమానం), జలచరాలు నీటిలో ఈదటం చూసి నౌకాయానం, తిమింగలాలను చూసి జలాంతర్గాములను ఇలా ప్రకృతిలోని వివిధ స్వరూపాలను చూసి 'అనుకరణ' ద్వారానే అపారమైన విజ్ఞానాన్ని సాధించగలిగాడు మానవుడు.

పిల్లలు మొదట తల్లిదండ్రులను అనుకరిస్తారు. ఆ తరువాత ఇతర పిల్లలను అనుకరిస్తారు. అయితే... పిల్లలందరినీ అనుకరించరు. తాము ఎవరితో నైతే సంబంధాలు పెంపొందించుకోవలెననుకుంటారో వాళ్ళను అనుకరించడం జరుగుతుంది.

అంతెందుకు నిజ జీవితంలో మనము ఎన్నో రకాలుగా గొంతు మార్చి పలుకుతుంటాం.

నిజజీవితంలో మాట్లాడే గొంతు (voice) వారి వారి వ్యాపారరీత్యా గొంతు మార్చి పలికిన సందర్భాలు ఎన్నో మనం నిత్య జీవితంలో చూస్తూ వుంటాము.

**ఉదాహరణ :**

ప్లాట్ ఫారం మీద చాయ్ అమ్మేవాళ్ళు చాయ్... చాయ్... అనీ, రోడ్డు మీద గాజులు, రిబ్బన్లు అనీ, ఆ... ఉల్లిగడ్డ అనీ, ఇంకా చాలా

> మానవుడు ఉపయోగించే అత్యంత శక్తి వంతమైన ఔషధం మాటలే.
> \- కిప్లింగ్

వంంది రకారకాలుగా గొంతు మార్చి రకారకాల వస్తువులు అమ్ముతుంటారు. మనకు అవసరమై అడగ్గానే 'ఎమండీ ఏం కావాలి'? అని సాధారణ (voice) గొంతుతో అంటారు. వీరి గొంతుల్ని పరిశీలించి నట్లయితే ఇంట్లో ఒక విధంగా, వ్యాపారరీత్యా మరొక విధంగా ఆయా సందర్భాన్ని బట్టి గొంతు యొక్క (frequency) పౌనః పున్యం మారుతుంది.

మనం కూడా మన బాస్ వద్ద కృతజ్ఞతభావంగా, మన సబార్డినేట్ దగ్గర కమాండింగ్‌గా గొంతు మార్చి మాట్లాడుతుంటాం.

ఈ విధంగా మనకు తెలియకుండానే మన గొంతులో (frequency) మారుతూ ఉంటుంది. అంటే కొంత వరకు గొంతు మారుతుందనే విషయం పరిశీలిస్తే ప్రతి ఒక్కరు స్పష్టంగా గుర్తించవచ్చు. ఈ విధంగా మానవుడికి అనుకరణకు చాలా దగ్గరి సంబంధం ఉందని చెప్పవచ్చును.



కర్ణాటకలోని మంగుళూరు యూనివర్సిటీలో ప్రోగ్రాం చేస్తున్నప్పటి దృశ్యం...

> ఇతరుల గురించి చెడుగా మాట్లాడేవాడు విషసర్పానికన్నా ప్రమాదకారి.
>
> \- ఎల్. కాక్సు




**1. మాట్లాడటానికి సహాయ పడే అవయవాలు :**

మానవుడు మాట్లాడడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా అనేక రకాల అవయవాలు తోడ్పడుతున్నాయి. అవి ఓకాలిస్ మజిల్, థైరో ఎరిటినాయిడ్, క్రికో థైరాయిడ్ మరియు ముఖ్యంగా స్వరపేటికలోని 'ఓకల్ కార్డ్స్' (స్వరతంత్రులు). ఇవియే కాకుండా పెదాలు, పళ్ళు, నాలుక, కొండనాలుక, గ్రసని, స్వరపేటిక, ఊపిరితిత్తులు మొదలగునవి కూడా మాట్లాడడానికి తోడ్పడుతాయి.

**2. ధ్వని ఉత్పత్తి :**

ఒక దారాన్ని తీసుకొని ఒక చివర పంటితో నొక్కి, రెండవ చివర గట్టిగా లాగి, దారాన్ని వేలితో మీటితే 'ధ్వని' ఉత్పత్తి అవుతుంది. దారానికి బదులు రబ్బరు బాండ్‌ను పెట్టి మీటితే మరొక రకం ధ్వని వస్తుంది. అలాగే బ్లేడును బల్లకు ఉన్న చీలికలో పెట్టి మీటితే ఇంకొక

> వ్యక్తి చిరునవ్వును బట్టి అతని వ్యక్తిత్వాన్ని కొంత వరకు అంచనా వేయవచ్చు.
>
> \- బోలే

రకం ధ్వని వినిపిస్తుంది. దారం, రబ్బరు, బ్లేడు ఇవన్నీ ధ్వనిని ఏర్పరచే సందర్భంలో ముందుకు వెనుకకు కదులుతాయి. ఈ విధంగా వస్తువు ముందుకు వెనుకకు కదలడాన్ని 'కంపనం' (Vibration) అని అంటారు. ఈ కంపనాలు కంటికి కనిపించనంత సూక్ష్మంగా జరుగుతాయి. కనుక వాటిని మనం చూడలేము. అనగా వస్తువు కంపిస్తే ధ్వని పుడుతుందని నిర్ధారించవచ్చును.

### 3. మానవుని గొంతులో ధ్వని ఉత్పత్తి :

మానవుని స్వరపేటికలో ఒక జత తంత్రులు ఉంటాయి. వీటిని స్వరతంత్రులు (Vocal Cords) అంటారు. మానవుని ఊపిరితిత్తుల నుండి గాలి బయటకు వచ్చేటప్పుడు సర్వతంత్రులు రెండు దగ్గరగా చేరి ఊపిరితిత్తులలోని గాలి ప్రవాహానికి అడ్డు వచ్చినప్పుడు కంపించడం వలన శబ్దం ఉత్పత్తి అవుతుంది. అంటే స్వరతంత్రులు కంపించడం వలన ధ్వని ఉత్పత్తి అవుతుందని నిర్ధారించవచ్చును.

### 4. మిమిక్రీ కళాకారుడు గొంతు మార్చడం :

మిమిక్రీ కళాకారుడు కూడా సాధారణ మానవుడే. అయితే అతని గొంతులోని స్వరతంత్రులను ఒకే సమయంలో (ఒక సెకన్‌లో) ఒకే సంఖ్యలో కంపనాలను కలిగిస్తాడు. ఇలా కలిగించటాన్ని ఫిజిక్స్‌లో అ వస్తువు (గొంతు) యొక్క పౌనఃపున్యం (frequency) అంటారు. ఈ పౌనఃపున్యం ఆధారంగా సాధన చేత మిమిక్రీ కళాకారుడు గొంతు మార్చగలుగుతాడు.

నీకు వీలయినంత వరకు సర్వదా చిరునవ్వులు చిందిస్తూ వుండు. అది చౌక అయిన ఔషధం.

\- బైరాన్

## 5. శబ్ద గ్రహణం (Sound Recieving) :

మొదట ధ్వని తరంగాలు బాహ్య చెవి ద్వారా కర్ణభేరిని తాకినప్పుడు కర్ణభేరి కంపిస్తుంది. ఈ కంపనాలు మధ్య చెవిలోని అవయవాల నుండి లోపలి చెవిలోని 'ఆర్గన్ ఆఫ్ కార్టి'(Organ of Corti)ని చేరుకొని చివరికి శ్రవణనాడి ద్వారా మెదడును చేరుతాయి. అప్పుడు మనకు ధ్వని వింటున్న అనుభూతి కలుగుతుంది. ఈ విధంగా విన్న ధ్వని స్పందనలకు మెదడు స్పందించి ప్రతిచర్యలను జారీ చేస్తుంది.

శబ్ద గ్రహణం ఆధారంగా మిమిక్రీ కళాకారుడు తాను వినిపిస్తున్న సౌండ్స్ లేదా గొంతులలోని అసమానతలకు అనగా లోటు పాట్లను సవరించుకుంటాడు. కావున మిమిక్రీ ప్రదర్శన ఇచ్చేటప్పుడు శబ్ద గ్రహణానికి మానిటర్‌ను గాని లేదా ఒక సౌండ్ బాక్స్‌ని కళాకారునికి దగ్గరగా పెట్టుకొనవలెను.

## 6. ఆడ, మగ గొంతులలో తేడా :

స్త్రీల స్వరపేటిక, పురుషుల స్వరపేటిక కంటే చిన్నగా వుండటం వల్ల స్వరతంత్రులు పొట్టిగా, మందంగా వుంటాయి. అందువలన స్త్రీల స్వరం సన్నగా వుంటుంది. పురుషుల స్వరపేటిక పెద్దగా వుండటం వల్ల వీటి స్వరతంత్రులు పొడుగ్గా వుంటాయి. అందువలన పురుషుల స్వరం గంభీరంగా వుంటుంది.

> కంటిని నమ్మాలికాని, చెవిని నమ్మకూడదు.
>
> \- హెరోడోటస్

## 7. భిన్న స్వరాలు :

అందరి రూపాలు వైవిధ్యభరితంగా ఉండటానికి జన్యువులు కారణం అయినట్లుగానే, అందరి స్వరాలు భిన్నంగా వుండటానికి సంబంధించిన జన్యువు మరియు వారి స్వరపేటికలో వున్న స్వరతంత్రుల నిర్మాణంలో తేడా వలన విభిన్న వ్యక్తుల స్వరాలలో వ్యత్యాసం వుంటుందని చెప్పవచ్చును.

## 8. జంతువులు మాట్లాడ లేకపోవటానికి కారణం :

జంతువులు మాట్లాడ లేకపోవటానికి ముఖ్యంగా సర్వపేటికకు మెదడుకు సంకేతాలను తీసుకపోవు శ్రవణ నాడి జంతువులకు ఉన్నప్పటికిని అది సరిగ్గా అభివృద్ధి చెందలేదని కొందరి అభిప్రాయం. కాగా మాట్లాడటానికి **(Speech)** సంబంధించిన భాగం మెదడులో లేదని మరి కొందరి అభిప్రాయం. అందు వలన జంతువులు మాట్లాడలేక పోతున్నాయని అంటారు.



కాకతీయ యూనివర్సిటి - మిమిక్రీ సెమినార్‌లో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ మిమిక్రీ కళాకారుల బృందం...

ఆదర్శాలు లేని వ్యక్తులు ఎన్నటికి ఎదగలేరు.

- గోల్డ్‌స్మిత్




ఒక మనిషికి మెడకాయ మీద తలకాయ ఎంత అవసరమో మిమిక్రీ ప్రదర్శనకు మంచి సౌండ్ సిస్టమ్ అంత అవసరము. మిమిక్రీ కళాకారుడు ప్రదర్శన ఇస్తున్నప్పుడు ఈ క్రింది జాగ్రత్తలు తప్పకుండా తీసుకోవలయును.

1) మిమిక్రీ ప్రదర్శించడానికి ప్రస్తుతానికి అందుబాటులో ఉన్న వాటిలో శ్రేష్ఠమైన అహుజా కంపెనీకి సంబంధించిన 80 వాట్ ఆంప్లిఫైర్, 100 వాట్ స్పీకర్స్ రెండు, **CUM 450** లేదా **ASM-580 XLR** మౌత్‌పీస్, కళాకారుడు ఫీలింగ్స్ చూపించడానికి ఒక స్టాండ్ కనీసం ఉండాలి.

ప్రపంచంలో గొప్ప అదృష్టవంతుడెవరంటే?
ఒక మంచి 'మిత్రున్ని' కలిగి ఉన్నవాడే.

– షేక్‌హాజి 'నూరాని'

2) యాంత్రిక శబ్దాలను అనుకరించాలంటే 'ఎకో' ఉంటే ఆ ప్రోగ్రామ్ రసవత్తరంగా ఉంటుంది. గ్రామాలలో ప్రోగ్రామ్ ఇస్తున్నప్పుడు మంచి సౌండ్ సిస్టమ్ దొరక్కపోవచ్చు. అలాంటప్పుడు యాంత్రిక శబ్దాలను వినిపించకపోవటం ఉత్తమం.

3) ప్రోగ్రామ్ ఇస్తున్నప్పుడు రెండు సౌండ్ బాక్స్‌లను ప్రేక్షకులకు ఎదురుగా ఉండునట్లు చూడవలెను. మానిటర్ ఉంటే తను ప్రదర్శిస్తున్న ఐటమ్ ఎలా వస్తుందో గ్రహించి, సరిఅయిన పోఃనపున్యంతో కళాకారుడు అనుకరించి సరిచేసుకొనగల్గుతాడు. మానిటర్‌లేని పక్షంలో ఒక బాక్స్‌ని స్టేజీకి 5 మీటర్ల దూరంలో ఉంటే తను ప్రదర్శిస్తున్న ఐటమ్ గ్రహించడానికి వీలుగా వుంటుంది.

4) సాధ్యమైనంత వరకు సౌండ్‌బాక్స్‌లలోనే ప్రోగ్రామ్ ఇస్తే బాగుంటుంది. సౌండ్ బాక్స్‌లేని పక్షంలో పుంగలలో ప్రోగ్రామ్ ఇవ్వవలెను. అయితే... పుంగల్ని కాని సౌండ్ బాక్స్‌లను కాని ఏ చెట్టుమీదనో, గుడిమీదనో, ప్రేక్షక సమూహానికి అవతలనో పెట్టకుండా ప్రేక్షకులకు ఎదురుగా వుండునట్లు జాగ్రత్త పడవలెను.

5) మిమిక్రీ ప్రదర్శిస్తున్నపుడు స్టేజీ తప్పకుండా ఉండాలి. స్టేజీ అందరికి సులభంగా కన్పించేంత ఎత్తులో ఉండాలి. స్టేజి పైన

వచ్చిపోయేటివి రెండు – డబ్బు, జబ్బు
పోతే రానివి రెండు – మానం, ప్రాణం
వస్తే పోనివి రెండు – కీర్తి, అపకీర్తి.

– కీ॥శే॥ బుర్రకథ హనుమంతరాజు

మూాడు వైపుల కర్టెన్స్ ఉండి, అంతా ప్లెన్‌గా వుంటే ఆర్టిస్టు యొక్క హావభావాలు ప్రేక్షకులకు స్పష్టంగా కన్పిస్తాయి.

6) కళాకారుడు జిగ్‌జాగ్ డ్రెస్‌లు కాకుండా ప్లెన్ దుస్తులు ధరిస్తే బాగుంటుంది.

7) కళాకారుడు **Time Maintanance** తప్పకుండా పాటించాలి.

8) స్టేజికి బాక్స్‌లు అతిదగ్గరగా కాని, సౌండ్ బాక్స్‌ల ఫేస్ కళాకారుని వైపు వుండకూడదు. అలా వుంటే బాక్స్‌ల నుండి వీజిల్ వచ్చి డిస్ట్రబ్ అవుతుంటుంది. కావున బాక్స్‌లను ప్రేక్షకులకు ఎదురుగా వుంచాలి.

9) కళాకారుడికి మిమిక్రీతో పాటు మైక్ సెన్స్ కూడా తెలిసివుండాలి.

10) ప్రోగ్రామ్ సందర్భానుసారంగాను మరియు పాజిటివ్ ధోరణిలో వుండాలి.

కవి అయినవాడు గాఢంగా ప్రేమించైనా వుండాలి లేదా దుర్భర పరిస్థితినైనా ఎదుర్కొని వుండాలి.

– గ్లోబల్ సూక్తి

బొమ్మ శ్రీనివాస్

# శ్రీను గురించి...

అది 1988. తేది రాసుకోని సుదినం. డైరీకెక్కని శుభదినం. వేదిక C.K.M. కళాశాల సెమినార్ హాల్. శీను స్టేజి ఎక్కి 'ఇప్పుడు నేను మిమిక్రీ చేయబోతున్నానని' ప్రకటించగానే విద్యార్థులంతా ఈలలు, అరుపులు, చప్పట్లు, నవ్వులు కేరింతల తోరణాలతో స్వాగతం పలికారు. క్షణంలో ఆ వాతావరణం శోభాయమానం అయ్యింది.

రకరకాల శబ్దాలు, సినీనటుల డైలాగులు విన్పిస్తున్నప్పుడు ప్రతి సౌండ్‌ని అభినందించడం ప్రతి డైలాగ్‌ని అనునయించడం, జోక్ వేస్తున్నంత సేపు ప్రేక్షక సమూహారం కడుపు చేతబట్టి నవ్వటం, ఇనుప ఊచలకు వేలాడిన విద్యార్థులంతా నవ్వాపుకోలేక ఒక్కసారిగా కుప్పకూలడం ఇప్పటికీ నాకు బాగా గుర్తుంది. అనంతరం ఇది నా మొదటి ప్రోగ్రామ్ అంటూ శీను ప్రకటించడం గురువులు ఆశీర్వదించడం, మిత్రులు అభినందించడం చకచకా జరిగిపోయాయి. ఈ అద్భుత సంఘటన నుండి ఒక్కసారిగా తేరుకొని నేను శీను దగ్గరి కెళ్ళి ప్రత్యేక అభినందనలు తెల్పడం, పరస్పర పరిచయాలు తేనీరు సేవించడాలతో మా స్నేహానికి జరిగిన అంకురార్పణ దినదిన ప్రవర్థమానమై, ఇంతింతై వటుడింతై అన్నట్లు మాతో పాటు మా రెండు కుటుంబాలనే ఒక్కటి చేసింది.

శ్రీ బొమ్మ వెంకటయ్య, కళావతి పుణ్యదంపతులకు జూన్ 2, 1969న జన్మించిన ఏకైక పుత్ర ఆణిముత్యం శ్రీ బొమ్మ శ్రీనివాస్. నలుగురు చెల్లెళ్ళకు ఆప్తుడైన అన్నయ్య శ్రీనివాస్. నిగర్వి, మృదుభాషి, నిష్కల్మషమైన స్నేహశీలి, నిరంతర కృషీవలుడు, నిరాడంబరత్వానికి నిలువెత్తు సాక్ష్యం శ్రీ బొమ్మ శ్రీనివాస్.

మిమిక్రీ... మిమిక్రీ...

మిమిక్రీ శ్రీనివాస్ గారి ప్రేరణ, వై. పరమేశ్వర్ రావు గారి శిష్యరికం, మిమిక్రీ పీఠాధిపతి డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారి ఆశీస్సులు పొందిన కళా కుసుమం బొమ్మ శ్రీనివాస్.

కళలకు ఏ మాత్రం సంబంధం లేని ఒక సామాన్య కుటుంబంలో పుట్టిన శీను 6వ తరగతి చదువుతుండగా మిమిక్రీ శ్రీనివాస్ గారి ప్రోగ్రామ్ చూసి పొందిన ప్రేరణతో మిమిక్రీ యే ఊపిరిగా బతుకునారంభించాడు. అంతేకాదు ప్రకృతిలోని ప్రతి అణువు నుండి ప్రేరణ పొందుతూ ఎడారిలో ఒయాసిస్సులా రూపొందాడు. మిమిక్రీ రంగంలోని ఒక్కొక్క శిఖరాన్ని అధిరోహిస్తూ తన జైత్రయాత్రను కొనసాగిస్తున్నాడు. దశాబ్దానికి పైగా 1800లకు మించి ప్రదర్శనలిచ్చి అశేష కళాభిమానుల గుండెల్లో స్థానాన్ని సుస్థిరం చేసుకున్న కళాకారుడు. ఆంధ్రదేశంలోనే కాక గుజరాత్, మహారాష్ట్ర, ఒరిస్సా, కర్ణాటక, తమిళనాడు వెం॥ రాష్ట్రాల్లో పర్యటించి మిమిక్రీ, వెంట్రిలాక్విజమ్ ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల మన్ననలందుకున్న ప్రతిభాశాలి. ఈయన సౌండ్స్, తెలంగాణా మాండలికంలో జోక్స్, అడ్వటైజ్‌మెంట్స్, ఇండియన్ న్యూస్ రివ్యూ, రేడియో, టి.వి., సినీకళాకారుల కంఠస్వరాలను అద్భుతంగా అనుకరించడంలో దిట్ట.

ఈయన స్థానిక సాంస్కృతిక సంస్థచే 'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ' బిరుదును, **M.L.A.** శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావు గారి చేతుల మీదుగా కళావాహిని 'టాప్‌టెన్ అవార్డు'ను అందుకున్నాడు.

సినీ ప్రముఖులు అక్కినేని, యస్.పి. బాలు, డా॥ సి. నారాయణరెడ్డి, పరుచూరి గోపాలకృష్ణ, తమ్మారెడ్డి, మాజీ ముఖ్యమంత్రులు శ్రీ మర్రి చెన్నారెడ్డి, నాదేండ్ల, ప్రస్తుత ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారిచే, ప్రజాకవి కాళోజీ, డా॥ నేరెళ్ళ, అర్జున అవార్డీ పిచ్చయ్య, అజయ్ శర్మ (అథ్లెట్) గార్ల చేతుల మీదుగా సత్కారాలను, ప్రశంసలను అందుకోవడం ఆయన కళాతృష్ణకు తార్కాణం.

బొమ్మ శ్రీనివాస్

ఏ కళా రాధకుడు ఆయన ప్రతిభకు మెచ్చి మొదటి చప్పట్లు చరిచాడో, ఏ కళాతపస్వి అతని అద్భుత హాస్యానికి మొదటి చిరునవ్వు చిందించాడో అతనికి ఉజ్జ్వలమైన భవిష్యత్తునే ప్రసాదించాడు. లేకుంటే సుశిక్షితుడైన సైనికుడు కదన రంగాన గెలుపే లక్ష్యంగా ముందుకు ఎలా దూసుకుపోతాడో శీను అలాగే సాగిపోయేవాడు కాదు. ఈనాడు కేవలం ప్రదర్శనలకే పరిమితం కాక, మిమిక్రీకి సంబంధించిన పుస్తకాన్ని వెలువరించి గొప్ప సాహసాన్ని చేసి డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ అంతటి మహానుభావుల సరసన చేరటం అతని పూర్వజన్మ సుకృతం తప్ప మరొకటి కాదు.

## శ్రీను జీవితాశయం - విశ్లేషణ :

ఇక ఆయన జీవితాశయం గురించి ప్రస్తావించినపుడు పాన్, గుట్కా, మద్యపానం, జూదం లాంటి అనేక దుర్వ్యసనాలు నేటి మన సమాజాన్ని దహించి వేస్తున్నాయని ఆవేదన చెందుతాడు. ఇవి చాలవన్నట్లు 'మూలిగే నక్క మీద తాటికాయ పడ్డ' చందంగా సాంఘిక అసమానతలు, భాషా - ప్రాంత బేధాలు, కులమత వైశమ్యాల వల్ల భావితరాలకు కలిగే అనర్థాల నేపథ్యంలో పట్టువదలని విక్రమార్కుడిలా ఈ సామాజిక రుగ్మతలను తన శక్తి మేరకు మిమిక్రీ ప్రదర్శన ద్వారా రూపు మాపే ప్రయత్నం చేస్తానంటాడు. కుటుంబ నియంత్రణ, పల్స్‌పోలియో, అక్షరాస్యతా ప్రాముఖ్యతల్ని తనదైన బాణీలో మిమిక్రీ ద్వారా తెలియజెప్పి ప్రజల్ని చైతన్య పరిచే మహాయజ్ఞం నిర్వహిస్తున్నాడు.

మతం కన్నా 'కళ' గొప్పదని, ప్రాంతం కన్నా 'దేశం' గొప్పదని నమ్మే శ్రీనివాస్ నవ్వు ఆరోగ్యానికి 'టానిక్' లాంటిదంటాడు. నవ్వడం వల్ల విడుదలయ్యే 'ఎండార్ఫిన్' ఎంజైమ్ ఒక్క క్షణం నవ్వితే, నాలుగు క్షణాల ఆయుష్షు ప్రసాదిస్తుందని, మతం మనుష్యుల్ని వేరు చేస్తే, కళ ఏకం చేస్తుందని ఎలుగెత్తి చాటే శ్రీనివాస్ యువతకు ఆదర్శ ప్రాయుడు. ఈయన కళారంగంలో వరంగల్ కీర్తి బావుటా ప్రపంచ స్థాయిలో ఎగరేసే జగజ్జేత కావాలని ఆశిస్తూ ...

- షేక్ పాషా 'నూరాని'

# ప్రశంసలు

1. ఇండియన్ న్యూస్‌రివ్యూ క్రియేటివిటి చాలా గొప్పగా వుంది నాయనా!

- 'పద్మ విభూషణ్' కాళోజి నారాయణరావు

2. పి.వి. నర్సింహారావు, రావుగోపాలరావు, శాంతిస్వరూప్ & ఆంజనేయ శాస్త్రిలను అనుకరించడంలో శ్రీ బొమ్మ శ్రీనివాస్‌కు సాటిలేరు.

- పద్మశ్రీ డా॥ నేరెళ్ళ వేణుమాధవ్

విశ్వవిఖ్యాత ధ్వన్యనుకరణ తపస్వి

3. ఇక్కడ ఇంత జనం ఉన్నారంటే అదికేవలం శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రోగ్రామ్ చూడటానికి మాత్రమేనని గర్వంగా చెప్పుకోగలను.

- అర్జున్ అవార్డు గ్రహీత శ్రీ పిచ్చయ్య

4. బొమ్మ శ్రీనివాస్ గారి ప్రోగ్రామ్ మూడు సార్లు చూసి ఎంతో ఆనందం పొందాను. మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది.

- 'రెబల్ స్టార్' కృష్ణంరాజు

5. రేడియో న్యూస్ రీడర్లవాయిస్, తెలంగాణ జోక్స్ చెప్పడంలో శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రతిభ అమోఘం.

- బాబు మోహన్ - సినీ హాస్య నటులు

6. శ్రీ బొమ్మ శ్రీనివాస్ విన్పించిన 'తెలంగాణ మాండలికం' జోక్స్ కడుపుబ్బ నవ్వించాయి. తెలంగాణ జోక్స్ క్రియేటివిటి అద్భుతం.

- శ్రీ ధర్మన్న సాదులు - మాజీ కేంద్రమంత్రి

- ప్రభుత్వ విప్ శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావు యం.ఎల్.ఎ.

7. నా తోటి మిత్రులందరు వెళ్లినా ఈ బొమ్మ (టాకింగ్ డాల్) ఎలా మాట్లాడుతుందో చూడటానికి ప్రోగ్రామ్ చివరి వరకు ఉన్నాను. అదో అద్భుత కళ. ఇందులో శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రతిభ అమోఘం.

- శ్రీ తక్కెళ్ళపల్లి పురుషోత్తమరావు

మాజీ రోడ్లు భవనాల శాఖామాత్యులు

8. వరంగల్ కీర్తి ప్రతిష్ఠలను ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఇతర రాష్ట్రాలకు తెలియజేసిన కళాకారుడు శ్రీ బొమ్మ శ్రీనివాస్.

- శాలినీ మిశ్రా ఐ.ఎ.యస్.

9. ఆయనలో ఉన్న మరో గొప్పతనం ఏమంటే సుత్తి కొట్టకుండ డైరెక్ట్‌గా ఐటానికి వెళ్ళిపోతాడు. శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రోగ్రామ్‌లో 100% కామెడి ఉంటుంది.

- శ్రీ సీతాల రఘువేందర్ - మ్యూజిక్ డైరెక్టర్

- శ్రీ శంకర్, సారంగపాణి - సినీగాయకులు

10. ఒక ప్రోగ్రామ్‌లో దాదాపు 350 రకాల గొంతుల్ని వరార్చగల ప్రతిభావంతుడు శ్రీ బొమ్మ శ్రీనివాస్.

- మైమ్ కళాధర్ - వరల్డ్ రికార్డ్ హోల్డర్

11. వెయ్యి గొంతుల కలయిక మిమిక్రీ శ్రీనివాస్

- కీ॥ శే॥ బుర్రకథ హనుమంతరాజు

12. బొమ్మ శ్రీనివాస్ తన టాకింగ్ డాల్ ప్రదర్శనలో కొత్తదనం చూపడం అందరికి నచ్చింది. టాకింగ్ డాల్ మాట్లాడే విధానాన్ని ఇంద్రజాల ప్రదర్శన గుర్తుకు వచ్చేలా చేసి చూపారు.

- ఈనాడు దినపత్రిక

13. ఎదుటివారిని నవ్వించటానికి తనపై తానే జోక్స్ క్రియేట్ చేస్కొని నవ్వించడానికి ఏ మాత్రం వెనుకాడని గొప్ప వ్యక్తి శ్రీ బొమ్మ శ్రీనివాస్ ఆయన ఎప్పుడూ నవ్వుతూ - నవ్విస్తుంటాడు.

- మిత్రులు

## వివిధ పత్రికల్లో బొమ్మ శ్రీనివాస్ గురించి...

1. 'బహుముఖ ప్రజ్ఞాశాలి' - అక్టోబర్ 8, 1994 - వరంగల్ వాణి
2. మిమిక్రీలో రాణిస్తున్న బొమ్మ శ్రీనివాస్ - నవంబర్ 11, 1997 - వార్త
3. 'స్వరానికే స్వరమాంత్రికుడు' బొమ్మ శ్రీనివాస్ - జనవరి, 1998 - వరంగల్ ఎక్స్‌ప్రెస్
4. 'స్వర' మాంత్రికుడు శ్రీనివాస్ - డిసెంబర్ 7, 1998 - ఆంధ్రప్రభ
5. మిమిక్రీ శిక్షణా శిబిరాన్ని ప్రారంభించిన బొమ్మ శ్రీనివాస్ - 1998 - వాయిస్
6. బహుముఖ ప్రజ్ఞాశాలి బొమ్మ శ్రీనివాస్ - జనవరి 30, 1999 - వార్త
7. ధ్వన్యనుకరణ ప్రవీణుడు బొమ్మ శ్రీనివాస్ - జూలై 29, 1999 - పొద్దు
8. ధ్వన్యనుకరణ ప్రతిభాశాలి బొమ్మ శ్రీనివాస్ - సెప్టెంబర్ 29, 1999 - విశాలాంధ్ర
9. విజ్ఞాన విశేషాలతో విస్తృతంగా మిమిక్రీ ప్రదర్శనలిస్తున్న బొమ్మ శ్రీనివాస్ - డిసెంబర్ 15, 1999 - కళాకేంద్రం
10. మిమిక్రీ పరిచయం : బొమ్మ శ్రీనివాస్ - డిసెంబర్ 15, 1999 - సేవా ప్రపంచమ్
11. ధ్వని అనుకరణ అతని 'కంఠాభరణం' - జనవరి, 2000 - భావతరంగిణి
12. మిమిక్రీలో ప్రజ్ఞాశాలి బొమ్మ శ్రీనివాస్ - ఫిబ్రవరి, 2000 - కళాజగతి
13. 'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ' బొమ్మ శ్రీనివాస్ - మే, 2000 - పద్మపీఠం
14. ప్రపంచాన్ని వెలుగుచూసిన మిమిక్రీ పుస్తకం - చర్చ

# కృతజ్ఞతలు

1. English Literacyలో సహకరించిన
శ్రీ కొండబత్తిని జగదీశ్వర్ రావు గారికి...

2. డా॥ పి. సాంబశివరావు గారికి...
M.B.,B.S., D.L.O., E.N.T., D.O.,
Secretary A.P. State, E.N.T. Doctors Association.

3. 35వ డివిజన్ కార్పొరేటర్
కోలువుల సుధాకర్ గారికి...
ఇంటి నెం. 10-2-42, గోవిందరాజులగుట్ట, వరంగల్ - 2.

4. కంచర్ల మహేందర్ గారికి...
విజయ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, వరంగల్.

5. మామిడాల వేణుగోపాల్ గారికి...
**DTP OPERATOR** B.Com., PGDCA.,
ఇంటి నెం. 17-5-58, కరీమాబాద్, వరంగల్-2. ఫోన్: **422849**

6. ఆడెపు ప్రశాంత్, విజ్జిగిరి రాజు గారికి
ప్రింటర్స్

మరియు

మిత్రులకు, శ్రేయోభిలాషులకు, బంధువులకు ఇంతవరకు నా ప్రోగ్రామ్స్ ఏర్పాటు చేసిన ఆర్గనైజర్లకు, కళాకారులకు, ఆర్థికం సహకరించిన వారికి ముఖ్యంగా పత్రికా ప్రతినిధులకు ప్రతి ఒక్కరికి పేరు పేరునా హృదయపూర్వక కృతజ్ఞతలు.

*ఈ పుస్తకం మొదటి, రెండవ ముద్రణలకు కొంత ఆర్థికంగా సహకరించిన డా॥ బండా ప్రకాశ్ గారికి, డా॥ మాచర్ల వీరేశం గారికి, డా॥ యం. సత్యదేవ్ గారికి, పద్మశాలి పరస్పర సంక్షేమ పరపతి సంఘం వారికి, గుండు సుధారాణి, గుండు ప్రభాకర్ గారికి మరియు సుధాకర్ సార్ గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు*



విశ్వవిఖ్యాత ద్వన్యనుకరణ సామ్రాట్ డా. నేరెళ్ల వేణుమాధవ్ గారితో...




హస్య నటులు శ్రీ బాబుమోహన్ గారిచే రాష్ట్రస్థాయి ప్రథమ బహుమతి నందుకుంటున్న...